# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50**

## క్షీరబలా తైలం

స్త్రీలకు బుతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3-0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగల్గరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4-0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు:

**శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు**



ఎతిరాజ్ ప్రొడక్షన్స్‌వారి 'ప్రియదర్శిని' చిత్రంలో నొక సన్నివేశము



సుభోధప్రొడక్షన్స్‌వారి 'భక్త శబరి'
చిత్రంలో సూర్పణఖగా నటించిన
యల్. విజయలక్ష్మి



ఝాన్సీవారి 'జన్మహక్కు' చిత్రంలో రాజగోపాల్,
ఛాయాదేవి, బాలకృష్ణ




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# ప్రపంచశాంతికి మార్గం

మద్రాసులో గోఖలేహాలులో నుపన్యసించుచు శ్రీ సత్య సాయిబాబా తన సందేశంలో సౌజన్యం, సహనం సత్యరతి ప్రపంచశాంతికి మార్గమని ఉద్బోధించారు. ఇవిలోపించిననాడు ఎవరు ప్రపంచశాంతి నుద్దేశించి ఎట్టి కృషిచేసినా ఆశయ లక్ష్యాలు సిద్ధించవు.

ఈనాటి కల్లోలానికి, అరాజకానికి మానవులలో ఆత్మపరిశీలనా లోపం ఒక కారణం. మరొకటి న్యాయ, ధర్మాల దృష్ట్యా మంచి చెడ్డను గుర్తించి వ్యవహరించగలస్థితిలో లేకుండుట. సౌజన్యం, సత్యనిరతి, సహనంపట్ల మానవుని నిర్లక్ష్యము స్వీయశ్రేయస్సును మంటకలుపుతున్నది. శాంతియుత సహజీవనమనునది ఉమ్మడి శ్రేయస్సును ప్రోత్సహించగల ఉత్తమ నైతికస్థాయివల్ల మాత్రమే సాధ్యము.

ఈ సందర్భమున మానవుడు యీనాటి పరిస్థితులతో అనేక కష్టాలను, విషమ

సమస్యల నెదుర్కొనవలసి వచ్చినా మానవభద్రతకు, శ్రేయస్సుకు ప్రపంచశాంతి అత్యవసరము. అయితే ప్రపంచశాంతి ప్రపంచమొత్తంమీద ఉత్తమమైన తిక స్థాయి ననుసరించిన పరస్పరసద్భావము, సానుభూతి, త్యాగము, చిత్తశుద్ధి, వాస్తవిక పరిజ్ఞానములతో సాధింప సాధ్యమగును కాని వానికి బదులుగా పశుబలం సాధించగలదను కోడం పొరబాటేకాక ఆత్మవిధ్వంసకముకూడాను.

మానవునిలోని సౌజన్యంవలన తనకుటుంబం, సంఘం ఉత్తమ స్థాయినందుకొని మంచిని ప్రోత్సహించడం జరుగుతుంది. భక్తివిశ్వాసములపట్ల నిర్లక్ష్యము అత్యంత ప్రమాదాలకు హేతువని మానవులు గ్రహించాలి. క్రమశిక్షణకు భక్తివిశ్వాసాలు, ప్రేమ ప్రధానాంశాలు. ప్రజలు సంఘజీవులుగా సుఖసౌభాగ్యములతో జీవయాత్ర చేయాలంటే భగవద్భక్తిని, పరమాత్మ పట్ల విశ్వాసమును అలవాటుచేసికోవాలి. అవిలోపించిననాడు మానవుడు తోడి మానవుని ప్రేమించలేడు సరిగదా అతనిస్థితి తెగి పోయిన గాలిపడగను బోలినదై నీతి నిజాయితీలకు దూరమైపోగలడు.

స్వార్థానికి, అధికార, ఆధిపత్య వాంఛలకలవాటుపడిన వారికి పరుల శ్రేయస్సు పట్ల ఆసక్తియుండదు. మంచిచెడ్డలనుగురించి ఆలోచించుటకు తగిన వాస్తవిక పరిజ్ఞాన ముండదు. సానుభూతి సద్భావములను కలిగియుండుటకనువైన హృదయముకాని, విశాలదృక్పథంగాని యుండవు. వీరు ప్రపంచశాంతికి ఏవిధంగా తోడ్పడకపోగా ఏ క్షణానికాక్షణం ప్రమాదావస్థను సృష్టిస్తుంటారు. కాబట్టి ప్రతియొక్కరు ఆత్మపరిశీలన కలవడి సత్యనిరతిని, సహనమును, సౌజన్యమును అలవర్చుకొని ప్రమాదావస్థలో నున్న ప్రపంచశాంతిని, భద్రతను, సౌభాగ్యమును పదిలంచేయవలసియున్నది.

—(౦)—

# వివాహం



ఆయుర్వేదాశ్రమం ప్రైవేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టరు డా॥ డి. గోపాలాచార్యులు సోదరుడు చి॥ శ్రీనివాసన్‌కు, చి॥ సౌ॥ వత్సలకు వివాహం జరిగిన సందర్భమున యీ నెల 1 వ తేదిన మౌంట్ రోడ్డు నందలి ఆబట్స్‌బరీలో సత్కారం, విందు జరిగినవి. శ్రీమతి యం. యల్. వసంతకుమారి పాటకచ్చేరి ఏర్పాటుచేయబడెను. అనేకమంది పురప్రముఖులు, బంధుమిత్రులువచ్చి వధూవరుల నభినందించి ఆశీర్వదించారు.

ఈ నూతన దంపతులకు భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి ఆదర్శప్రాయమైనవైవాహిక జీవితమును ప్రసాదించాలని మేము కోరుతున్నాము.

———

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



శ్రుతివాక్యములను విచారించుటలో, గురుశిష్యుల నాటకమును మరచినచో, అందు రుచి కనబడదు. నిస్సారముగ నుండును. శ్రుతి గ్రంథములలో, ప్రతి పుటయందును ఆశ్రమకుటీరము, కుటీరపంచయందు, గురువు ఉన్నతాసనమున, ఆత్మానుభవప్రకాశముతో బోధించుట, ప్రేమ, ఆతురత, శ్రద్ధతో శిష్యులు ముగ్ధులై వినుచుండుట, చిత్రించునట్లు తోచుచున్నవి. గురువు పలుకు ప్రతివాక్యమును శిష్యులు బుద్ధికుశలతతో పరిశీలించి ఆలకించుచున్నారు.

గురువు తెలుపు సమాదానము లేవియైన శిష్యుడు గ్రహించలేకపోయినను, అనుచరించలేకపోయినను, తన అసంతృప్తిని ముఖమున కనబరచుచుండును. గురువు అట్టి చిహ్నములను గమనించుచుండును. శిష్యునికి కలిగిన ప్రతి అల్ప సందేహమునుకూడ, ప్రేమతో, ఉదారహృదయముతో, సంశయరహితముగ, గురువు నివారించుచుండును. గురుశిష్యులు అన్యోన్యముగ, సోపానములు దాటి, పర్వతముల నెక్కి, ప్రమాద శిఖరముల చేరుచుందురు. శిష్యు డెక్కలేక ఎగబోసుకొనుచుండినచో, గురువు తన చేతినిచాచి శిష్యునిపైకి లాగును.

అహంకారమనబడు పక్షి ఎగిరి ఉన్నత శిఖరములు దాటుటకు, పూర్ణసంస్కారము పొందిన మనోబుద్ధులను రెండు రెక్కలవలె సహాయపడుచున్నవి. ఒక పక్షి, తన బిడ్డకు గాలియందు ఎగురుట నేర్పునట్లు, గురువు శ్రుతిపాఠములను బోధించు శైలివలన, శిష్యులు, పక్షిపిల్లలవలె ఎగుర నేర్చి, ఆవలనుండు బ్రహ్మపదవిని చేరగలుగుచున్నారు. ఈ పరిశ్రమయందు తనబిడ్డ, అలసిపోయి, నేలపై వ్రాలుట, తల్లిపక్షి చూచినతోడనే తానుకూడ దగ్గరనుండు చెట్టు కొమ్మపై వ్రాలును. పిల్ల అరచు కూతలకు తగునైన జవాబులను తల్లిపక్షి కూయుచు సమాధానమొసగును. అట్లు విపరీతముగ అరచుటవలన, తల్లికి కోపము కలిగెనాయని గమనించినచో, పిల్ల, తల్లియొక్క ప్రేమ, [illegible], తల్లి ఆనందముతో, హృదయపూర్వక ప్రేమతో కేకలువేయుట విశదమగుచున్నది. అతిత్వరలో, పిల్లయొక్క అరపులు ఆగిపోవును. చూచుచుండగ, పిల్ల ఎగిరిపోయి తల్లి ప్రక్కన చేరియుండును.

అదేవిధముగ శ్రుతి విచారములందు, గురుశిష్యుల సంభాషణయందు, గురువు చేరిన యున్నత శిఖరమును శ్రద్ధగల శిష్యుడు చేరలేకపోవును. అయినను, తల్లిపక్షికిగల ప్రేమవలె, శిష్యుని అంతరంగశక్తిని ప్రోత్సహించి, తిన్నగ, నెమ్మదిగ, తన ప్రక్కకు ఎగిరి రమ్మని, గురువు దారిచూపును. ఒకొకప్పుడు శిష్యుడు లేవలేకపోయినచో, అతని జ్ఞాన అంతస్థుకు గురువు దిగివచ్చును. అప్పుడు శిష్యుని యాత్ర సునాయాసముగ సాగిపోవుటకు, శక్తి కూడివచ్చుటకు గురువతనికి కొంత ఉపాసనాక్రమము విధించును.

ఇట్టి గురుశిష్యుల మైత్రిని జ్ఞప్తియందుంచుకొని శ్రుతుల విచారించుటత్యవసరము. ఉపనిషత్తులు నాటకములవలె నున్నవి. కొన్నివాక్యములు విడివిడిగ, సంబంధములు లేనట్లు కనబడును. కొన్ని సమయములలో ప్రమాదకర పునరుక్తి దోషమనివార్యముగ కనబడును. దాని భావము గూఢముగ నుండును.

ఈ ఉపనిషత్తునందెట్టి పూర్వప్రసంగములేని యొక సమస్య విచారము కలదు. అయినను, అందు వింతేమియు లేదు. గురువుల నన్వేషించు సాధకులకెల్ల ఇట్టి సంశయములుండును. పరిపక్వ మానవత్వము పొందిన ప్రతివ్యక్తికి, ఇట్టి సంశయములుండును. కనుక దానికి తగు సమాధాన మారంభమగుచున్నది.

"మొట్టమొదట" — ఒక విషయమును గురించి, బుద్ధిపూర్వక విచారము చేయుటయందు ఎట్లు, ఎప్పుడు, ఎచ్చట, ఎందుకు అను ప్రశ్నలు కలుగును. అనగా విషయసముదాయముల కాల, దేశ, కారణ నిర్ణయములను తెలియు ప్రయత్నమని గుర్తించవలెను. శిష్యుడు, నలువైపుల వ్యాపించియుండు ప్రపంచము యొక్క ఆద్యంతములు, తాను స్వయముగ విచారించెగా, సమాధానము దొరకలేదు. "ఈ విశ్వ ప్రపంచము ఎచ్చటనుండి కలిగెను. ఇది పుట్టుటకు

ముందేమియుండెను?" అని అతని ప్రశ్న. ఇట్టి ప్రశ్నలకు గురువు సమాధానము తెలుపుచున్నాడు. "ఈ దృశ్యప్రపంచము సృష్టియగుటకు పూర్వము, మొట్టమొదట, ఆత్మ యొక్కడే యుండెను".

ఒక బట్టల దుకాణము ప్రవేశించగనే, వివిధ రకపు వస్త్రములు, అనేక రూపములతో, వర్ణములతో, ఆకారములతో, గుణములతో కనబడును. అవి యు సృష్టియగుటకు పూర్వము పత్తియొక్కటే యుండెను. ఒక నగల బీరువను తెరచుటతో, అనేక రకపు ఆభరణములు, ఆ కిరీటముల, ఆ రముల, పేర్లు వెలలతో నుండు వి కనబడును. అవి సృష్టి పొందుటకు పూర్వము, మొట్టమొదట బంగారు యొక్కటే యుండెను. అదేవిధముగ, ఈ దృశ్యప్రపంచము సృష్టి పొందుటకు పూర్వము, ఆత్మ యొక్కడే, శాశ్వత, సర్వవ్యాపి, జ్ఞానస్వరూప - ఆత్మ యొక్కడే యుండెను.

"ఆత్మ యొక్కడే" - పూర్వము, శాంతి పాఠ విచారమున, బ్రహ్మమున, ఆత్మయనిన యొకటేయని విమర్శించియున్నాము. సృష్టికి పూర్వము, బ్రహ్మ యొక్కడే యుండెను - అనియుండిన చాల సిద్ధాంత సమ్మతముగ నుండగలదు. కాని ఇచ్చట, గురువు ప్రయత్నపూర్వకముగ, "ఆత్మ" యను పదమును వాడియున్నాడు. దీనికి కారణము లేకపోలేదు. వేదాంతమునగల సారము, దీనివలన తెలియుచున్నది.

మనలోయుండు ఆత్మను తెలిసికొనినయెడల, ఈ దృశ్యప్రపంచము, దానియొక్క విచారము పూర్తి కాగలదు. వస్త్రములకెల్ల, ప్రత్తి మూలకారణము. ప్రత్తి లేక వస్త్రములుండజాలవు. ఆభరణములెల్ల స్వర్ణమయము. స్వర్ణము లేక ఆభరణములుండజాలవు. ఇదే సామ్యమును బాహ్యప్రపంచమున, గురువు అన్వయించుచున్నాడు. అనేక స్వరూపములతో కూడిన ఈ ప్రపంచము సృష్టిపొందుటకు పూర్వము, సాధువని ఆత్మ యొక్కటే యుండెను. అదియే సర్వవ్యాపక, సత్యస్వరూప, పరబ్రహ్మము. ఘటాకాశమునకు మహాకాశమునకు భేదము లేదు.

"మిణుకు మనగల ఇతర వస్తువేదియు నుండలేదు. సృష్టికి పూర్వము. సర్వవ్యాపి, అద్వితీయ, పరిపూర్ణ ఆత్మకు అన్యముగ మరేమియు లేదనుటతో తృప్తి పొందక, చైతన్యముగల వస్తువు మరేదియు ఆ పరబ్రహ్మమునందుండలేదని, నిరసించుచున్నాడు. ఒక సామ్రాజ్యమునకు, ఏక కాలమున, ఇరువురు చక్రవర్తులుండజాలరు. ఇరువురుండిరని వాదించినచో, వారిరువురు చక్రవర్తి పదవి పొందినవారు కారని స్థిరమగుచున్నది. ఒక సామ్రాజ్యమునందు, నిరంకుశ పరిపాలనాశక్తిగలవాడు చక్రవర్తి యగును. ఇరువురు చక్రవర్తులుండినచో, ఒకరి సామ్రాజ్యమున మరొకరు కంటకులగుటచే, ఇరువురికి చక్రవర్తి పదవి లేకపోవును.

సృష్టికి పూర్వము ఆత్మగాక, ఆత్మవ్యతిరిక్తముగ (సాంఖ్యులు తలచునట్టి, ప్రధానమను చైతన్యశక్తి) మరొకటి యుండినచో, అప్పుడు రెండును పరిమితి స్వభావములు కలవగుచున్నవి. ఆత్మ ఆద్యంతరహిత యని తెలుపుటకై ఇదెల్లయు ఆత్మయందు ఒక్కటిగానే యుండెను, ఆ విషయము మరియు నొక్కి తెలుపుటకై, "చైతన్యశక్తి మరొకటి ఏదియు యుండలేదు" అని తెలుపుచున్నాడు.

ఆత్మ యొకటే యుండెను అను విషయము నిష్పక్షముగ తెలుపుటవలన, కుమ్మరివాడు తనకన్న భిన్నముగనుండు మట్టినుండి కుండలు తయారుచేయునట్లు, పరమాత్మ, తనకన్యముగనుండు ఎట్టివస్తువును, అనేక రూపభేదములుగల ఈ ప్రపంచసృష్టికై, నపేక్షించలేదు అని నిర్ణయించుచున్నాడు. ప్రపంచ సృష్టియందు నిమిత్తకారణము, ఉపాదాన కారణము, రెండును పరమాత్మయై యుండెను. ఇందువలన, వేదాంత తీర్మానము, "సృష్టి యనునది లేదు. పరమాత్మ యందారోపింపబడిన దృష్టి భ్రమయే సృష్టి యనబడుచున్నది" అను సిద్ధాంతము ప్రకటితమగుచున్నది. స్థాణువునందు భూతము కలుగలేదు. చూచువానియందు భ్రమయుండునంతకాలము భూతముగ పడుచుండును.

శ్రు॥ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి॥-(1)

[నేను లోకములను సృష్టించెదనుగాక - అని అతడు తలచెను.]

సృష్టి అనాదియని ప్రపంచమునగల మతములెల్ల అంగీకరించియున్నవి. ఇట్లంగీకరించిన మతములలో భారతదేశమునందలి షణ్మతములు ముఖ్యములు. (సృష్టిక్రమమును నిర్ణయించలేని మతములుకూడ ప్రపంచమున కొన్ని కలవు.) సర్వమత సమ్మతమగు ఇట్టి సిద్ధాంతమును విజ్ఞానపురుషులెల్లరు ఆమోదించుచున్నారు. అటుగాక, సృష్టియొక్క కాలము నిర్ణయించ యత్నించినచో, కాలమనునది సృష్టింపబడిన వాటిలో ఒక అంశము. కనుక సృష్టిని కాలపరిణామమున నిర్వచించుట సాధ్యముగాదు.

రెండనుభవముల మధ్య, కాలవ్యత్యాసము కనబడుచున్నది, ఒక అనుభవమున మనము లగ్నమై

యుండినచో, ఇతర స్పర్శ, మనకు నంటకున్నచో, మనమునకు కాలపరిజ్ఞానము చేకూరదు. ఉదాహరణమునకు — సుషుప్తి ననుభవించునపుడు, కాలపరిజ్ఞానము మనకు లేదు. జూదరులు జూదమాడునపుడు కాలమును మరచిపోవుచున్నారు. అందువలన, వివిధ అనుభవములను పొందగలిగిన మనసునకు కాలజ్ఞానము స్ఫృహించుచున్నది. వివిధ అనుభవములను పొందుటకు, వివిధ విషయాదరణము లుండవలెను. వివిధ సంబంధము లుండవలెను. ఒక అనుభవము కలుగుటకు, కర్త, కర్మ వీటి రెంటికిగల సంబంధము తెలుపు క్రియ యను త్రిపుటి యుండవలెను. ఇందువలన, విషయావరణములున్న, కాలజ్ఞానము, కాలానుభవములు చేకూరుచున్నవి.

విషయావరణములుగల ప్రపంచము - ఒక నిర్ణీత తేదియందు, ఒక సమయమున సృష్టి పొందెనని సమ్మతించినచో — జనవరి మొదటి తేది, శుక్రవారమున - సృష్టిపొందెననినచో, అనేక అనవస్థాదోషము లేర్పడుచున్నవి. ఆ దినము కలుగుటకు, దానికి మునుపటి దినముండవలెను - అనగా, గురువారము డిసెంబరు 31 తేది యుండవలెను - అట్లు లెక్కించుకొనుచుపోయిన, సృష్టికి పూర్వమొక కాలముండెనని వెదుకవలసివచ్చును. అది అసంభవము. కాలము సృష్టించబడిన విషయముగ నున్నది. అందువలన, ప్రపంచసృష్టి కలిగిన వెనుక, కాలపరిమాణ నిర్ణయమేర్పడెనని, ఒప్పుకొనవలసియున్నది. అట్టి కాలమానమును — సెకండు - అనిరి. అనగా రెండవది. అనగా సృష్టి మొదలు. కాలము రెండవది. రెండవ అనుభవమువలన కాలజ్ఞానము పుట్టుచున్నది. కనుక, సంవత్సరం పూజ్యం. మాసం పూజ్యం. తిధి పూజ్యం. గంట పూజ్యం. నిమిషం పూజ్యం. సెకండు పూజ్యం. అట్టిక్షణమున ప్రపంచసృష్టి కలిగెనని తెలిపి - కేవల అవివేకమనిపించుకొనుటకు బదులు, లేక భ్రమ కల్పించుటకు బదులు, సృష్టి అనాది యని ఋషులు ప్రకటించియున్నారు. సృష్టి అనాది యనినపుడు అందు ఏది ముందు, ఏది వెనుక సృష్టింపబడెను అనుట అవివేకము.

సృష్టికి పూర్వము ఆత్మ యొక్కడే యుండెను. రెండవ విషయము లేదు అని ఋషి తెలుపుచున్నాడు. మరల అతడు ఆలోచించెను అని పలుకుచున్నాడు. ఇందు భావ అత్యల్పముగ కనబడుచున్నది. ఇట్టి వేదాంతసందర్భమున, పూర్వపరిశోయములత్యవసరముగ నున్నవి. అటుగాక, ఆతురతతో చదువదొడగిన మతిభ్రమ కలుగును.

“అతడాలోచించెను” - సృష్టి కలుగుటకు పూర్వము ప్రళయమొకటి సంభవించును. ప్రళయకాలమున యుండిన జీవరాసుల వాసనలు తమ సమిష్టిబలమువలన, వాసనలు చెల్లించుకొనగల ఆవరణములను సృష్టించుకొని, అందు తృప్తి పొందుచున్నవని వేదాంతసమ్మతము. అట్టి వాసనలు పరిపక్వము కాగా, వాటి కనుకూలముగనుండు ప్రపంచమును సృష్టించుకొని, తృప్తి గాంచుచున్నవి. ఇట్టి వాసనల సమూహము, ప్రపంచసృష్టికి కారణాంశములగుచున్నవి.

పరబ్రహ్మము - ఆద్యంతరహితజ్ఞాన ఏకైక - సమిష్టి వాసనల మూలమున ప్రకటితమగుటవలన, ఈశ్వరుడనబడును. అతడే ఫలదాత. అట్టి ఈశ్వరుడు ప్రపంచసృష్టికి, నిమిత్తకారణము, ఉపాదాన కారణము కూడ అగుచున్నాడు. అయినను, అతడు తన ఇచ్ఛానుసారముగ, సృష్టి చేయలేకున్నాడు. సృష్టి పొంద యోగ్యతపొందిన సమష్టి వాసనల కనుగుణముగ, అతడు ప్రపంచమును సృష్టించ బద్ధుడైయున్నాడు.

ఒక నగరమున యొక ఉద్యానవనము నిర్మించవలసినచో ఆ సృష్టి పొందగల ఉద్యానవనమునకు విచ్చేసి, ఆనందించకోరు నగరవాసుల ఇచ్ఛానుసారము కంట్రాక్టరు ఉద్యానవనమును నిర్మించవలసియున్నది. అతని స్వేచ్ఛానుసారముగ తీర్చలేకున్నాడు. పిల్లలు అచ్చట గుమిగూడునట్లైన, పిల్లలకు యోగ్యమగు ఆటపరికరములచట అమర్చవలెను. యువకులు సమావేశమగుచో, వారాట్లాడి అలసి, చెమట కార్చుకొనగల క్రికెట్టు, హాకీ, ఫుట్బాల్ మొదలగు ఆటలకు తగుపరికరముల నమర్చవలెను. ముదుసలులు చేరగలిగినచో, నీడనొసగగల వృక్షములనేకములనాటి, వాటి నీడసోకగలుగునట్లు కుర్చీలు, బెంచీలు అమర్చవలెను. పళ్లుబారిన దేహములు కొంతకాలము కూర్చుని, ఓదార్చుకొనగల సౌకర్యముల నమర్చవలెను. అదేవిధముగ, సృష్టికర్తయగు పరబ్రహ్మము సమష్టి బ్రహ్మాండముయొక్క వాసనలచే బద్ధుడగుచున్నాడు. తన ఇచ్ఛానుసారము మేలు, కీడు, నిర్ణయించక, సమష్టివాసనల కనుగుణముగ, కంట్రాక్టరువలె నియమించవలసి యున్నాడు.

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డె సయంట్-ఎక్సుపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎన్. శర్మ



(తుది భాగము)

[రెండేళ్లనుంచి "రాజకుమార్" కథలో ముఖ్యపాత్రయైన రాజకుమార్ "గృహలక్ష్మి" పాఠక లోకానికి ఎంతో దగ్గరివాడయి పోయినాడు. తను వచ్చిన నక్షత్ర లోకాన్ని గురించి, తన యాత్రలో ఇతర గ్రహమండలాల్లో తను కళ్లారచూసిన దృశ్యాలను గురించి ఎన్నెన్నో సంగతులు మీకు చెప్పి మిమ్మల్ని సంతోషపెట్టాడు. తనూ సంతోషించాడు. విమానం చెడిపోయి ఎడారిమధ్యలో ఏకాకిగా వుండిపోయిన, ఈ అబ్బాయి కథను మీకు చెబుతూ వుండే పైలట్ జీవితానికి పెద్ద జ్యోతి అయిపోయినాడు. కాని అబ్బాయి నిలకడగా ఆయన దగ్గరవుండి పోతేగా! అబ్బాయి అమాంతంగా ఒకరోజు సాయంకాలం వాడి లోకానికి తిరిగివెళ్లి పోయినాడు. రాజకుమార్ అలా అదృశ్యమవటం పాపం! ఆపైలట్ ఎలా భరించగలుగుతాడు? ఎవళ్లయినా అబ్బాయి తిరిగి ఇక్కడికి రావటం చూశారా!...ఆ సంగతి చెప్పిన పైలట్‌కు తెలుపగలిగారా! ... ఇదే ఆయనకోరిక ఈ కోరికను మీకూ తెలుపుకుంటూ ఇప్పటికి మీ దగ్గరనుంచి సెలవుపుచ్చుకుని వెడుతూవున్నాడు....]

## I

రాజకుమార్ ఎంతో అమాయకుడు. వాడిని ఆ పాము అలా మోసం చేసింది. తన దోవలో ఆమాటలు ఈ మాటలూ చెబుతూ, వాడిని అమాంతంగా బుట్టలో వేసుకుంటూ ... అబ్బాయి ఎందుకు ఇలా అయిపోయాడు? ఆ విషమావస్థలో వాడికి ఇయ్యాల్సిన ధైర్యాన్ని ఇచ్చాను. దాంతో ఇక దోవలోకి వస్తాడని అనుకున్నాను. కాని విధి మనం చెప్పినట్లు వింటుందా? .. ఇలా అబ్బాయిని గురించి కంగారుపడుతూవున్న సమయంలో వాడు చడీచప్పుడూ లేకుండా అక్కడినుంచి మాయమైపోయాడు. అంతా గాఢాంధకారమయము. ఏ దోవన అబ్బాయి వెళ్లిపోయినట్లు? ఇంతకూ నాతో చెప్పకుండా ఎక్కడికి వెళ్లినట్లు ఈ కటికచీకట్లో?...

అబ్బాయి ఎక్కడికి వెళ్లినాసరే, వాడు వెడుతున్న దోవను తెలుసుకోవాలి. ఇంత రాత్రిలో ఇలాటి ప్రదేశాల్లో అబ్బాయిని పసిగట్టడం కష్టం, అయితేనేం?...

ఇలా నడిచి నడిచి కొంతదూరము వెడుతున్నాను, అబ్బాయి తనకేసి నేను నడవటం పసిగట్టాడు. అలసి సొలసి వుండాలి. రొజుతూ, రొప్పుతూ "ఆ వచ్చేది నువ్వే కదూ!" అంటూ నన్ను గట్టిగా కౌగిలించుకున్నాడు. దేహం కంపించిపోతూ వుంది.

"నువ్వు ఇంతదూరం నాకోసం రావటం ఏమంత బాగాలేదు. నాకోసం నువ్వు ఎంతో బాధపడాలసి వస్తుంది. ఏం వచ్చినా సరే దానికి తలఒగ్గక మనమేం చేయగలుగుతాం? .." అని బెదురుతూ నాకేసి చూస్తూ అన్నాడు అబ్బాయి.

ఆ మాటలకు ఏం జవాబియ్యాలి? మౌనమే అన్నివిధాలా మంచిదనుకుంటూ ఏం జవాబియ్యక ఊరక వుండిపోయాను.

"నేను ఎక్కడికి వెళ్లాలో నీకు బాగా

తెలుసు. అది ఇక్కడ వుంటేగా! ఎంతో దూరం ప్రయాణం చేస్తేనేగాని అక్కడికి చేరుకోలేను. ఈ దేహం ఇప్పటికే అలసి పోయింది. దీంతో గమ్యస్థానం చేరుకోటం సులభంకాదు'' అన్నాడు అబ్బాయి.

నా మౌనముద్రను వదిలాను కాను. అబ్బాయి వాడి ధోరణిని వదలుతాడా అంత సులభంగా?

''అంచేత ఈ శరీరాన్ని ఇక్కడే వదిలి పెట్టి వెళ్లటం మంచిదనుకున్నాను. అలా చేస్తున్నందుకు నువ్వేమాత్రం దుఃఖపడ వద్దు. ప్రయాణానికి పనికిరాని ఈ దేహాన్ని ఇక్కడే విడిచిపోవటంలో ఏమాత్రం తప్పు లేదు ...'' అని ఏమో చెప్పబోతున్నాడు.

దీనికి కూడా ఏం సమాధానం చెప్పకుండా వూరక వుండిపోయాను. నాయీ వాలకం చూడటంతో వాడిలో రేకెత్తుతూ వున్న వుత్సాహం పటాపంచలమైపోతూ వుంది. వాడు తన యీ విషాదావస్థను కప్పి పుచ్చటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ-

''ఇలా చేయబోతూ వున్నందుకు నువ్వేమీ భయపడవద్దు...ఈ ప్రపంచం సంగతి పూర్తిగా మరచిపోయినా మా మా నక్షత్రమండలాలకేసి తదేకదృష్టితో చూడటానికి అవకాశం వుంటుంది. ఇక్కడికిమల్లె అక్కడకూడా బోలెడు నూతులు వున్నాయి. అక్కడి నూతులకు ఇక్కడి నూతులకుమల్లె మంచి గిలకలూ వున్నాయి. గిరగిర తిరుగుతూ బ్రహ్మాండంగా రణగొణ ధ్వని చేస్తూవుంటాయి. ఆ ధ్వనిలోకూడా మధురాతి మధురానుభూతులను చవి చూస్తూ వుండవచ్చు....'' అని వుద్రేకంతో అన్నాడు.

దానికి కూడా జవాబు ఇచ్చినవాణ్ణి కాను.

''అలాటి మధురానుభూతులలో ఎంతో ఆనందం వుంది. ఎన్నెన్ని వాద్యాలను వాయించినా అలాటి గానామృతం మనకు లభిస్తుందా మరి? నాకు కావాలసింది ఒక్క నూయి కాదు. కోట్ల కోట్ల నూతులు...'' అని అబ్బాయి ఆ లోకాల రహస్యాలను ఎంతో వుత్సాహంతో చెప్ప సాగాడు.

నేను దానికికూడా సుతరాం జవాబిచ్చిన పాపాన బోతేనా? దాంతో వాడు ఏడ్వటానికి మొదలెట్టాడు...

◆ ◆ ◆

''ఆ! ఆ కనుబడుతుందే! అదే! వూ! అదే! నువ్వు ఇక్కడే వుండిపో. అటుకేసి నన్ను వెళ్లనియ్యి'' అంటూ ముందుకు అడుగెట్టబోయాడు అబ్బాయి. కాలు కదిలితేనా? భయపడిపోతున్నాడు. దాన్ని కప్పిపుచ్చాలన్ని ఎంతో ప్రయత్నిస్తూ వున్నాడు. అయితేనేం ఆ గుట్టును తెలుసు కోటం అంత కష్టమైతేగా..

తిరిగి అబ్బాయి తన ధోరణిలో పడి పోతూ ''నీకు జ్ఞాపకం వుందా? ఆ పువ్వు ఎంత మంచిదనుకున్నావు! దాని పోషణ నంతా చూసుకోవాలసింది నేనేగా .....
...నేనంటే నా పువ్వుకు ఎంతో ఇష్టం. దానినిచూసి ఎంతో కాలమైంది. నాకోసం ఎంత బెంగపెట్టుకుంటూ వుంటుందో, పాపం, నా పువ్వు! ..'' అని కంట తడి పెట్టుకుంటూ అన్నాడు.

ఇలాటి సమయంలో నా మౌనవ్రతం పనికివస్తుందా? వాడినిచూస్తూ మంద

హాసం చేశాను. ఆప్యాయంగా తల నిమురాను. దాంతో రాజకుమార్ కుదట పడుతూ "నువ్వు ఎప్పుడూ ఇలాగే మందహాసం చేస్తూ వుండాలి...ఇప్పటికే ఎంతో ఆలస్యమైంది. ఇక ఆలస్యం చేస్తే మా వాళ్లు వూరకుంటారా!...ఇక్కడే నువ్వు ఆగిపోవటం మంచిది. నిన్ను వదలిపెట్టి వెళ్లాలసిన చోటుకూడా ఇక్కడే!...చెప్పాలసినదంతా చెప్పానుగా! ఇక నువ్వు వచ్చిన దోవనే వెళ్లిపోవటం మంచిది" అని అంటూ నాకేసి వింతగా చూస్తూ గబగబ ముందుకు నడవసాగాడు....

ఆలా వాడు నడిచింది ఒక్క నిమిషమే. ఇంతలో బ్రహ్మాండమైన పిడుగు వాడి ముందర పడ్డట్లు శబ్దం! కనీ ఎరగని వెలుగు వాడి చుట్టూ! దీన్నంతా అబ్బాయి చూస్తూ ఒక్క గావుకేక వేశాడు...

అబ్బాయిని గట్టిగా హత్తుకుని భయపడవద్దని చెప్పటానికి వాడు నిలుచున్న చోటికి గబగబ నడిచాను.

ఇంతలోకి అవాలసినదంతా అయిపోయింది. విరుచుకుని అబ్బాయి ఇసుక మీద పడిపోయాడు. ఇంతవరకు దేదీప్యమానంగా మెరుస్తూ వున్న వెలుగు మాయమైపోయింది. తిరిగి చీకటి! కటిక చీకటి! ఇంక చడీచప్పుడు ఎందుకుంటుంది?

II

ఈ సంఘటన అయిపోయి ఇప్పటికి ఆరేండ్లు అయింది...దీన్ని ఎవళ్లకూ చెప్పకుండా ఇంతవరకూ ఎలాగో రహస్యంగా వుంచాను. నన్ను చూడటానికి వచ్చిన స్నేహితులు అంతటి ప్రమాదంనుంచి ప్రాణాలతో బయటపడినందుకు సంతోషించారు....కాని నా హృదయపీఠంలో రేగుతూవున్న విషాదాగ్నులు వాళ్లకేం తెలుస్తాయి? ఆ విషయంకూడా వాళ్లకు చెప్పినా అర్థమవుతుందా, మరి?...

అయిందేమో అయిపోయింది. దానిని గురించి అస్తమానమూ విచారిస్తూ వుంటే ఇక లాభం వుంటుందా?...ఈ ఒక్క సంగతి మాత్రం నాకు బాగా తెలుసు! అబ్బాయి వాడు వచ్చిన గ్రహమండలానికే తిరిగి వెళ్లిపోయాడు. వాడి దేహాన్ని అయినా చూస్తూ అంతా కాకపోయినా కొంతవరకయినా తృప్తిపడాలని కలలని కన్నాను. తెల్లవారాక, అక్కడికి వచ్చి చూచాను వాడి దేహంకోసం. అది అక్కడ కనబడితేగా!. పంచభూతాల్లో ఎప్పుడో కలిసిపోయింది అబ్బాయి దేహం...

రాత్రిపూట దృష్టి అంతా ఆకాశమండలంకేసే! తళుక్కు తళుక్కున మెరుస్తూవుండే నక్షత్రాలవైపే! అవి ఒకటా! రెండా! లక్షలకొలది నక్షత్రాలు వాటివాటి మార్గాల్లోనే ఆకాశమండలంలో వాటివాటి స్థానాలను ఆక్రమించుకుంటూ ఎంతెంత సందడి చేస్తూ వుంటాయో ఇక మాటలతో ఎలా చెప్పగలుగుతాను?...

పూర్వపు రోజుల్లో వీటిని చూడటం ఒక ఎత్తు. ఇప్పుడు చూడటం ఒక ఎత్తు అక్కడినుంచి వచ్చిన రాజకుమార్ని ప్రత్యక్షంగా చూశాను. అబ్బాయి మూలాన, ఈ జన్మలో కనీవినీ ఎరగని మధురానుభూతులను చవిచూడటానికి అదృష్టం కలిగింది.–

ఇక్కడ అబ్బాయి నా దగ్గరున్న రోజుల్లో వాడు అడిగిన వస్తువులను ఎంతో ఆప్యాయంగా తయారుచేసి ఇచ్చాను. వాటిని తదేకంగా చూస్తూ ఎంతో మురిసి

(328వ – పేజీ చూడుడు)

# ప్రాక్పశ్చిమ సంగీతం

శ్రీ జాన్. టి. రీడ్
[అమెరికా దౌత్యాలయ సాంస్కృతికాధికారి]



ప్రాక్పశ్చిమ సంగీత కళలను సన్నిహిత పర్చే కృషి ఇటీవల సంవత్సరాలలో చాలా జరిగింది. ఈ కృషి తేలికైందిగాదు. దీనికి అంతు అంటూ లేదు. మిన్నియాపాలిస్ సింఫనీ, న్యూయార్కు లిటిల్ సింఫానిక్ ఆర్కెస్ట్రా (వంటి ప్రఖ్యాత వాద్య సమ్మేళనాలు మద్రాసు, బొంబాయి నగరాలలో సంగీత కచేరీలు జరిపాయి. ఇండియన్ రికార్డుల కంపెనీ ఒకటి 1960 జనవరినుంచి పాశ్చాత్య సాంప్రదాయక సంగీత రికార్డులను అమ్మకానికి పెట్టింది. ఈ రికార్డులు మామూలు 3 నిమిషాల రికార్డుల కంటే పెద్దవి. ఈ కంపెనీ తాజాగా విడుదలచేసిన వాటిలో సిజర్ ఫ్రాంక్ సింఫనీ రికార్డులున్నాయి.

భారతీయ సంగీతం ఇప్పుడిప్పుడు అమెరికా, ఐరోపాలలో నాగరికులలోనే అయినప్పటికీ, బాగా ప్రశస్తిలోకి వస్తున్నది. 1955 లో ఆలీ అక్బర్ ఖాన్, చతురులాల్. వంటి భారతీయ సంగీతకులు అమెరికా వివిధ ప్రాంతాలలో సంగీత కచేరీలు చేశారు. ఈ నాడు రవిశంకర్ అంటే అమెరికన్ సంగీత వర్గాలలో ఎరుగని వారుండరు. ఆయన 1956 లోనూ 1957 లోనూ కచేరీలు చేశారు. రవిశంకర్ సితార్ వాయించటంలో చూపిన ప్రతిభ కొందరు గొప్ప వైలనిస్టులు కూడా తల వొంచేటంత అద్భుతంగా ఉంటుంది, అని న్యూయార్కు టైమ్సు పత్రికలో ఒక వ్యాఖ్యాత శ్లాఘించాడు.

ఈ నాడు అమెరికాల్లో భారతీయసంగీతం రికార్డులు బాగా దొరుకుతున్నాయి. భారతీయ సాంప్రదాయక సంగీతం గురించి, చరిత్ర గురించియు నెస్కో అధ్వర్యాన తయారు చేయించిన చరిత్రను లండన్ రికార్డ్సు అనేకంపెనీ ప్రచురించింది. ఇంకా కొన్ని అమెరికన్ కంపెనీలు కూడా భారతీయ సంగీతం రికార్డులు అమ్ముతున్నవి. వీటినిగురించి ముచ్చటిస్తూ ఒక అమెరికన్ వ్యాఖ్యాత ఇట్లా అన్నాడు. 'కొన్ని విషయాలలో భారతీయ సంగీతం ఎంతో ముందున్నది. పాశ్చాత్య సంగీతం దానిని అందుకోటానికి ఒక శతాబ్దమైనా పడుతుంది.

ప్రాగ్దేశీయ సంగీతం – ముఖ్యంగా భారతీయ సంగీత రీతులు కొన్ని కొందరు పాశ్చాత్య వాగ్గేయకారుల్ని మంత్రముగ్ధుల్ని చేశాయి. వీరిలో ఎలాన్ హోవానెస్ విషయం చాల కుతూహల కరంగా ఉంటుంది. ఈయన గతసంవత్సరం ఫుల్ బ్రైట్ వినిమయి కార్యక్రమం క్రింద ఇండియా సందర్శించారు. హోవానెస్ వాగ్గేయరచనలు బహుళ ప్రచారానికి వస్తున్నవి. శాస్త్రబద్ధ సంగీతకారుడుగా ఆయన ప్రశస్తిలోకి వస్తున్నారు. ఇటీవల టైమ్ వారపత్రికలో ఆయననుగురించి

వ్రాసిన ఒక వ్యాసంలో ఇట్లా శ్లాఘించబడింది. హోవానెస్ చాలవరకు స్వయం సిద్ధుడని వచ్చును. ఆయన ప్రతిభకు భారతీయరాగాలు, ఆర్మీనియన్ జానపద నృత్యాలు చాల దోహదమిచ్చాయి. యూరోపియన్ ఆధునికాలకంటే, వీటి ప్రభావమే ఆయనమీద హెచ్చుగా పని చేసింది ... భారతదేశపు వీధులలోనూ జపాన్ నాటకశాలల్లోనూ తన కృతుల మారుమ్రోత వినిపించిందంటాడు హోవానెస్. తన సంగీతానికి ప్రాచీన సూత్రాలు, ప్రాచీన సంస్కృతులు ఆధారమంటాడాయన. 'ప్రాగ్దేశ సంగీత మథనం నా జీవిత ధ్యేయం' అని హోవానెస్ చెప్పుకొన్నాడు.

ఆయన ఇటీవల భారతదేశం వచ్చి వెళ్ళకముందుకూడా భారతీయ సాంప్రదాయక సంగీత వర్ణాలలో ప్రయోగాలు చేసి నమూనావర్ణాలు సృష్టించాడు. 'ఖలీన్' (పియానో సంగీతం). 'అపాన్ ఎన్ ఛాంటెక్ గ్రౌండ్' వంటి కృతులలో ఈ కృషి వ్యక్తమవుతుంది. హోవానెస్ ఇండియాలో ఉండగా భారతీయరీతులు, ఇతివృత్తాలు తీసుకొని కొన్ని కృతులు రచించారు.

ఇటీవల కొన్ని వారాలక్రితమే జపాన్‌లో హోవానెస్ కృతి 'సింఫనీ నంబరు 8' (అర్జున) కచ్చేరీ అక్కడి ప్రేక్షకులను కడు రంజింపజేసింది. ప్రాచీన జపానీ పద్యం ఒకటి ఆధారంగా రచించిన బృందగేయం కూడా ఈ సందర్భంలో ప్రేక్షకులు విన్నారు. అదీ ఆయన కృతే.

ప్రాక్పశ్చిమ సంగీతాలు ఏనాడైనా ఒక దానిలో ఒకటి లీనమైపోతాయా అనేది సందేహాస్పదమే అట్లా జరిగితే ప్రమాదంకూడా. ఉద్యానవనంలో వల్లెనే సంగీత కళలోకూడా విభిన్నత్వం వాంఛనీయం. అదే కమనీయంగా ఉంటుంది. అయితే, ప్రాచీన సంగీతానికి పాశ్చాత్య సంగీత రుచులకు బంధుత్వం ఏర్పడుతుండటం ఆనందం కల్గించే మధురానుభూతి. హోవానెస్ వంటి సంగీత విద్వాంసులు, భారతీయ సంగీత కళా సంపదను పాశ్చాత్య ప్రజలకు అందించడం సంతోషకారణం.

---



# క్షమాపణ

శ్రీమతి బి. జి. ప్రసూనాంబ



తుపానులనేకం వస్తుంటవి, పోతుంటవి కాని వానిని స్ఫురణకు తెస్తూ మిగిలేవి తలక్రిందైన చెట్లు చేమలు, పాడుబడ్డ యిండ్లు మాత్రము. అలాగే మానవ జీవితంలో పొరపాట్లు సహజం. వానిని మరచిపోయి జీవయాత్ర సాగించక తప్పదు. కాని పొరపాట్ల ఫలితాలు వికృతరూపం దాల్చినప్పుడు మాత్రం అవి చిరస్మరణీయాలగుట కూడ కలదు. ప్రపంచంలో ఘటికుడై యితరులను మోసగించవచ్చును కాని ఆత్మ పరమాత్మలను మోసగించ ప్రయత్నించడం ముమ్మాటికి ఆత్మవిధ్వంసకానికి దారి తీయగలదు.

రాజమహేంద్రవరానికి బదిలీ అయిందని వినగానే ఆనందపరవశుణ్ణయినాను. నేను ఉద్యోగం చేస్తున్నా కవిని, గాయకుణ్ణి. కళారాధనకు, సాహిత్యసేవకు నేను అనుక్షణంకోరేది ప్రశాంతవాతావరణము. ఎప్పటికప్పుడు దానిని సృష్టించుకోడానికి ప్రయత్నిస్తుండేవాడిని. ఇక ఆ వాతావరణము గౌతమీతీరాన సహజంగా సమకూరిందికదాయని సంతృప్తిచెందాను. నా ఆశయలక్ష్యాల సిద్ధికి గౌతమీక్షేత్రం అన్నివిధాల తోడ్పడుతుందని గట్టిగా నమ్మాను. దాంతోపాటు నేను రాజమహేంద్రవరమునకు వెళ్లిన కొద్దికాలానికే బాల్యమిత్రునితో పరిచయమేర్పడి ఏ లోటులేని జీవయాత్ర నుపక్రమించాను.

తీరిక సమయాలలోను, సెలవు రోజులలోను నేను నా మిత్రుడు మధు గౌతమీ తీరానికి చేరుకునేవారము. మేమిక్కడ చల్లని చెట్లనీడన, పక్షుల కిలకిలల మధ్య గంటలు తరబడి గడిపేవారము. అక్కడ నేననేక గీతాలు అల్లేవాడను. వానిని గొంతెత్తి గానం చేస్తుంటే పశుపక్ష్యాదులు సయితం మైమరచి ఆలకించేవి. గౌతమి నా గానానికి దివ్యనర్తకిలాగ పరవళ్లు త్రొక్కుతూ ప్రవహిస్తున్నదా యనిపించేది. నా కవిత్వములోని భావసంపదను, లాలిత్యాన్ని పండితపామరులు అభినందించేవారు. నా అమరగానం మానవులనేకాక దేవతలను సయితం తన్మయులుగా చేస్తున్నదేమోనని అనేకులు భావించేవారు.

సహజంగా మానవుడు మధురస్వప్నములు, సుఖభోగములు అనుభవించునప్పుడు అవి శాశ్వతములుగా భావిస్తాడు. కాబట్టే అవి మరుగైన మరుక్షణమే ఎదుర్కొనవలసిన కష్టాలను, దుఃఖాలను చూచి విలపిస్తాడు, భయకంపితుడౌతాడు — లేదా నిస్పృహ నిరాశలతో కుప్పకూలిపోతాడు. అలాగే నా సరళమైన జీవయాత్రకు చుక్కెదురైంది. ఒకరోజున సాయంకాలము గోదావరీ తీరాన నడిచి వెళుతున్నాము. అక్కడక్కడ గుంపులు గుంపులుగా జనం చల్లగాలికి కూర్చొని సేద తీర్చుకొంటున్నారు. కొంతదూరం పోయేసరికి దూరంనుండి ఎవరో బాలిక పాడుతున్న పాట వినిపించింది. సున్నితమైన, శ్రావ్యమైన కంఠస్వరం — వినడానికి ఎంతనో యింపుగానున్నది. మరికొంచెము ముందుకు వెళ్లాం. ఆ బాలిక పాడుతూ మా వైపుకే వచ్చింది. ఆమె ముఖంలో విషాదఛాయలు కనుపిస్తున్నవి. చిన్నవయసు. చాలీచాలని జాకెట్టు, చినిగిన పరికిణ ధరించియుంది. ఆమె చేతిలో అణా డబ్బులున్నవి. ఆమె కంఠస్వరము, పోలికలు దేనినో స్ఫురణకు తెచ్చినవి. చిరపరిచితురాలు - ఎక్కడనో!_ఎవరో అమ్మాయి? ఉన్నట్లుండి నా గుండెలు దడదడలాడాయి. మహాపరాధం చేసినవానిలాగ తలవంచుకపోయింది. అప్రయత్నంగా "మధూ! యీ యమ్మాయి ఎవరైయుంటుందో!" అన్నాను.

"బాగుంది! నాకు మాత్రం ఏమి తెలుసు!"

"ఇంత చిన్నపిల్లయియుండీ బిచ్చానికెందుకు బయలుదేరాల్సి వచ్చిందో!"

"ఏంచేయాలి మరి? ఉన్న మహారాజులు తమకున్నది కదాయని తిని అనుభవిస్తూ లేనివారికి లేదు కాబట్టి మాడి చావాలంటారు. ఇక పొట్టపోసుకోడానికి మరొక మార్గం లేనప్పుడు యింతే".

ఆ యమ్మాయి పాడుకొంటూ మా దగ్గరకొచ్చి చేయిజాపింది. నేను "నీ పేరేమిటమ్మాయ్!" అని అడిగాను.

"శాంత".

"చాల మంచిపేరు. ఇలా తిరిగి అడుక్కుంటున్నావే నీకు యమ్మ, నాన్న, మరెవ్వరు పెద్దవాళ్లు లేరా నీకు?"

ఆమె కండ్లు చెమ్మగిలినవి. తలవంచుకునే మెల్లగా "మా అమ్మ, నాన్నలను నేనసలు ఎరగను. నన్ను మా అవ్వ పెంచి పెద్దదాన్ని చేసింది. క్రిందటి సంవత్సరం కలరావచ్చి ఆమెకూడ చనిపోయింది. అప్పటినుండి నే నేకాకి నయ్యాను" అని చెప్పింది.

"ఇలా బజార్ల వెంబడి యిల్లిల్లు తిరిగి బిచ్చమెత్తి జీవించడంకంటె ఎక్కడైనా ఒక యింట్లో చాకిరిచేసి బ్రతుకకూడదూ?"

"అంతకంటె కావలసిందేముంది బాబయ్యా! ఏ పుణ్యాత్ముడైనా దయతలిస్తే తప్పకుండా చాకిరి చేస్తాను".

"అయితే రేపటినుండి మా యింట్లో నుందువుగాని. నేనొంటరిగాణ్ణి. కాస్త అన్నం వండిపెట్టి యిల్లు చక్కదిద్దుకోవాలి. నీకు అన్నం, గుడ్డలకు ఏమి లోటుండదు."

"అలాగే బాబయ్యా!" అని విప్పారిన ముఖంతో వెళ్ళిపోయింది. ఆమె వెళ్తున్నంతసేపూ ఆమెవంకనే చూచాను. తలవనితలంపుగా నా కండ్లనుండి రెండు నీటిబిందువులు క్రిందికి జారినవి. ఆమెను చూచినప్పటి నుండి, మాటలు విన్నప్పటినుండి నా మనసులో ఏదో చేయివేసి దేవినట్లనిపించింది. పదేండ్ల క్రిందటి విషాదసంఘటన కనుల ఎదుట ప్రత్యక్షమయింది. అచ్చం ఆ పోలికలు, మాటలు వాణివే.

నన్ను చూచి మధు "ఇదేమిటోయ్! ఎవతో బిచ్చగత్తెను చూచి నీవు ఏడుస్తున్నావు! చేతనైన సహాయం చేస్తానంటివి; ఆమె వెళ్లిపోయా — అయినా యిలాటి దిక్కుమొక్కు లేనివాళ్ళకోసరం ఏడుస్తూ కూర్చుంటే ఎప్పటికి తెల్లవారుతుంది! పద పోదాం" అన్నాడు చిరాకుగా. సాధారణ పరిస్థితులలో నయితే నేనూ అలాగే భావించేవాడినేమో కాని శాంతను చూచినప్పటినుండి నాలో రేగిన తుఫానును గురించి మధుకేం తెలుసు! మధు ఓదార్పు నా బాధను యినుమడింపజేసింది. మధు వెంబడి మెల్లగా నడుస్తున్నానే కాని నాలో కుములుతున్న దుఃఖము అగ్నిపర్వతములా ఎప్పుడు పగిలి బ్రద్దలగుతుందో నన్నట్లుండింది. నేను తీరా యిల్లుచేరి గదతలుపు తెరచి లోనికి పోయి మంచంమీద వాలిపోయాను. దిండుకు ముఖాన్ని ఆనించి భోరున ఎంతసేపు ఏడ్చానో నాకే తెలియదు.

మరునాటినుండి శాంత మా యింట్లో నే యుండి పోయింది. తర్వాత మధు నన్నెప్పుడూ ఆ యమ్మాయి ఎవరని కాని, ఆమెను మొదటిసారి చూచినప్పుడు ఏడ్చిందెందుకని కాని అడుగలేదు. కాని నాలో మనోవ్యాధి ఏర్పడింది. క్రమంగా నాలోని ఉత్సాహం, సంతోషం నశించసాగినవి. కని పెంచిన తల్లిదండ్రులు, ప్రేమించిన ప్రియుడు మోసం చేస్తే గమ్యస్థానాన్ని నిర్ణయించుకోలేని స్త్రీలాగ ప్రవహిస్తున్నట్లు గౌతమి సయితము నన్ను దెప్పి పొడుస్తున్నదా యనిపించసాగింది.

శాంత మా యింటికి వచ్చినప్పటినుండి ఎవరో చెప్పినట్లుగా యింటి పనులలో నిమగ్నురాలైంది. ప్రతిరోజు నేను అడుగకముందే అన్నపానాది వసతులను అమర్చేది. క్షీణదశలోనున్న నా ఆరోగ్యంపట్ల ఎంతో ఆదరణతో నన్ను పరామర్శ చేస్తుండేది. తల్లిలాగ ప్రక్కన కూర్చొని వడ్డించి నేను తిని లేచి వెళ్లిన తరువాత తను భుజించేది. ఇంత ఆత్మీయత మా యిద్దరి మధ్య ఏర్పడడానికి కారణం భగవన్నిర్ణయం కాక మరేముంటుంది! నేను తరచుగా ఆలోచిస్తుండేవాడిని — యీమె తల్లిదండ్రు లెవరై యుంటారాయని. కాని ఆమె తనకేమి తల్లిదండ్రులను గురించి తెలియదంటుంటే ఆమెను వారిని గురించి అడిగిమాత్రం లాభం ఏమున్నది? అయినా ఆ ప్రశ్నతో ఆ పసిహృదయానికి కష్టం కలిగించడం నాకిష్టముండేది కాదు.

నా మనోవ్యాధి కట్టలుతెగిన వెల్లువలాగ పెరిగిపోతున్నది. ఒక్కొక్కనెల గడచినకొలది రూపురేఖలలోను, మాటలలోను వాణిలాగ రూపొందసాగింది. నా పిచ్చిపిచ్చి యూహలకు ఆది అంతము లేకుండా యున్నవి. వాణి మరెక్కడ, ఎలాగున్నదో ఆమె పతనానికి తన బాధ్యతను మరువలేకపోయాను. నా ఏకాంత జీవితం గతజీవితాన్ని గురించి ఆలోచిస్తూ క్రుంగిపోసాగింది. మధు, నేను షికారుకంటూ వెళ్ళడం అరుదైపోయింది. ఆరోగ్యం పూర్తిగా నీరసించి జ్వరము, అందులో దగ్గు ఆరంభమయినవి. మధు నా పరిస్థితిచూచి ఆందోళన పడసాగాడు. నేను ఆఫీసుకు శలవుపెట్టానే కాని మనశ్శాంతిలేని నాకు ఆరోగ్యం ఎలాగ మెరుగగుతుంది? ఒక విధంగా శలవు పెట్టడం నా మనోవ్యాధి ఎక్కువ కావడానికి తోడ్పడింది. మధు డాక్టర్ను పిలిపించి చికిత్స చేయించ మొదలుపెట్టాడు. నాకెన్నో విధాల ధైర్యంచెప్పి నా ఆరోగ్యాభివృద్ధికి తోడ్ప

డాలని ప్రయత్నం చేసేవాడు. కాని లాభం లేదని చూచి "మీ వాళ్ళకు టెలిగ్రాం యిచ్చి పిలిపించనా" అని ఒకరోజున అడిగాడు.

"వద్దు మధూ! వద్దు. నా ఆరోగ్యం దానంతటదే చక్కబడుతూంది. నీవుంటివి - శాంత ఉండెను. మీరు చేస్తున్నదానికంటె ఎవరు వచ్చిమాత్రం చేయ కలిగేది ఏమున్నది!" అన్నాను.

మధు మారు మాట్లాడలేక "నీ యిష్టం - జాగ్రత్తగా నుండు" అనిచెప్పి వెళ్ళిపోయాడు. నాకు మాత్రం వాణి ఏమయిందో, ఎక్కడుందో తెలిసికోవాలనే ఆరాటం, ఆసక్తి ఎక్కువయినవి. అనేకసార్లు పాత చిరునామాకు వ్రాస్తే ఆమాకి తెలుస్తుందని అనుకున్నాను కాని వ్రాయడానికి చేతులాడలేదు.

ఆరోజు రాత్రిఅంతా తీవ్రమైన జ్వరం. బాధ, ఆరాటాలతో బ్రతుకుమీదే విరక్తి పుట్టింది. గుండెల్లో బాధ భరించరానంతగా నున్నది. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూచాను. పాపం! శాంత రాత్రంతా నా ప్రక్కనే కూర్చొని విసురుతూ, మందు, అడిగినప్పుడల్లా మంచినీళ్లు అందిస్తుండింది. తెల్లవారుఝామునకు నాకు కొద్దిగా నిద్రపట్టింది. మరల మెలుకువ వచ్చేసరికి బాగా ప్రొద్దెక్కింది. నెమ్మదిగా లేచి శాంతను వెతుక్కుంటూ వంట యింట్లోకి వెళ్ళాను. ఏదో ఫొటోను ముందుంచుకొని మొక్కరిల్లి యున్నది. దగ్గరకెళ్ళి చూచి నా కళ్లను నేను నమ్మలేకపోయాను. అది వాణి ఫొటో - అక్కడ అది చూచి ఓపిక తూలిపోయి వెక్కి వెక్కి ఏడ్చాను. శాంత కంగారుపడుతూ వచ్చి నా చేయి పట్టుకొని మెల్లగా లేవదీసి మంచం దగ్గరకు తీసికొనివెళ్లి పడుకోబెట్టింది. మధు కోసరం కబురు పంపింది.

"శాంతా! ఆ ఫొటో ఒకసారి యిటివ్వు" అన్నాను.

ఆమె ఆ ఫొటోను నాకిస్తూ "మా అమ్మను మీకు తెలుసా" అన్నట్లుగా నావంక చూచింది.

నేనా ఫొటోను హృదయానికి హత్తుకున్నాను. కన్నీళ్లతో ఫొటోను తడిపాను,

శాంత నా ప్రక్కన కూర్చొని "బాబయ్యా! మా అమ్మను మీకు తెలుసా? ఈమె మా అమ్మట - మా అమ్మ దేవతలాంటిదని మా అవ్వ చెప్తుండేది" అన్నది ఫొటోను చూస్తూ.

"నిజమే! ఆమె నిజంగా దేవతలాంటిదే" అనుకున్నాను. నా నోటివెంట మాట పెగలలేదు. నా వళ్ళంతా కంపరమెత్తింది. ఆ క్షణంలో నేనుచేసిన పాపం బ్రద్దలు కానున్నదా యనిపించింది. శాంత తల్లిని బలిగొన్నవారిలో నేనూ ఒకణ్ణని ఆమెకు తెలిస్తే ఆ లేతహృదయం నన్ను శపిస్తుందేమోనని భయపడ్డాను. ఈ ఆవేదన, బాధ నాలోనే అంతమొందితే మంచిదనుకున్నాను. పితృవాత్సల్యంతో శాంతను దగ్గరకు చేర్చుకున్నాను. ఆమె నుదిటిని ముద్దాడాను. శాంత కన్నీటి బిందువులు నా మండుతున్న హృదయాన్ని కొద్దిగా చల్లబరచినవి.

ఇంతలో మధు వచ్చి నన్ను చూస్తూ "ఏమిటీ రభసంతానూ! అసలు విషయం ఏమిటో చెప్పవూ! మా ప్రాణాలు తీయకుండా" అన్నాడు.

"చెప్పిమాత్రం ఏం లాభం! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లుంటుంది" అన్నాను నిస్పృహతో.

"అలా కాదు; నేనేమైనా నీకు తోడ్పడగలనేమో చూద్దాం! పైగా ఆప్తులతో చెప్పుకోవడం వలన హృదయభారం తగ్గుతుంది."

"ఇప్పటి నా బాధ తగ్గేది కాదు; నేను క్షమించరాని..."

"అలా అనకు - ప్రతివ్వానిలో ఏవో కొన్ని పొరబాట్లుంటాయి. వానిని సమర్థించి సవరించుకోడమే మానవ స్వభావం."

"ఆ యవకాశం ఏనాడో జారిపోయింది."

"అయియుండవచ్చు - గతాన్ని గురించి చింతించి ప్రయోజనం ?"

"శూన్యమని నాకు తెలుసు; కాని అది ఆరని జ్వాల మధూ!"

"అదేదో చెప్పు - మనమిద్దరం యింత ఆప్తమిత్రులమై యుండి కూడా..."

"మధూ!..."

"ఫరవాలేదు చెప్పు!" అన్నాడు మధు నా పక్కమీద కూర్చుంటూ.

ఒక్కసారి గతచరిత్ర అంతా మెదడులో గిర్రున తిరిగింది. మొదలుపెట్టాను.

"మా నాన్న నన్ను రాఘవయ్యగారింట్లో దిగ

విడ్చాడు. నాకు ఏదో కొద్దిగా చదువు వచ్చు అప్పటికి, రాఘవయ్యగారే నన్ను బళ్ళోచేర్చి చదువు చెప్పించసాగాడు. వాణి రాఘవయ్యగారి కుమార్తె. నాకంటె నాలుగేండ్లు చిన్నది. ఆమె నేనుకూడ బడికి వెళ్ళి చదువుకునేవాళ్ళం. అయితే రాఘవయ్యగారు సంపన్నులు, నేను బీదయింటి బిడ్డను. నేను వాళ్ళ యింట్లో పనిపాటలు చేస్తూయుంటే వాళ్ళు నాకు చదువు చెప్పిస్తూ పోషించేవారు. రాఘవయ్యగారు, ఆయన భార్య నన్ను అభిమాన వాత్సల్యాలతో చూచేవారు. వాణి, నేను ఆడుతూ, పాడుతూ, అన్యోన్యంగా నుంటుండేవాళ్ళం. మమ్మలను చూచి రాఘవయ్యగారి భార్య మురిసిపోయేది. రాఘవయ్యగారికి తప్ప యింట్లో అందరికీ మా యిద్దరి అన్యోన్యానురాగాలు తెలుసు. నేను బి ఏ. చదువుతుండగా వాణి యుక్తవయస్సుకు వచ్చింది. స్కూలుఫైనలు కాగానే ఆమెను బడికి మాన్పించేశారు. నేను మాత్రం బి. ఏ. ప్యాసయ్యాను. రాఘవయ్యగారు నాకు తమ ఆఫీసులోనే ఉద్యోగం యిప్పించగా, వాళ్ళ యింట్లోనేయుంటూ వచ్చాను. వాణికి, నాకు మధ్యగల స్నేహం ప్రేమగా రూపొందింది. అది క్రమంగా అభివృద్ధయింది. ఇదంతా రాఘవయ్యగారి భార్యకు, యింటిల్లిపాతికి తెలుసు. రాఘవయ్య మాత్రం తన ఆఫీసు గొడవలతో ఏదీ పట్టించుకునేవాడు కాదు.

తర్వాత రెండు సంవత్సరాలకు నేను రెండు నెలలు ఆఫీసుకు శలవుబెట్టి మా యూరికి వెళ్ళి తిరిగి వచ్చేసరికి రాఘవయ్యగారు నాతో "నీకిక యుద్యోగంకాని, మా యింట్లోయుండ అవకాశం కాని లేదు" అని చెప్పాడు.

నాకు ఆశ్చర్యమేసింది. కారణము ఏమిటని అడిగి తెలుసుకోవాలని ప్రయత్నించాను. కాని రాఘవయ్యగారు మాట్లాడలేదు. నా పెట్టె, పడక, యితర సామానులు యింట్లోనుండి వాకిట్లో పడేశారు. నేను చేయకలిగింది మరేమిలేక నా దారిన నేను వెళ్ళిపోయాను. తర్వాత వాణి గర్భవతి అని, ఎక్కడో హాస్పిటలులో కనినదని తెలిసింది. రాఘవయ్యగారు తనకది భరింపరాని అప్రతిష్ట, అవమానంగా ఎంచి వాణిని సయితం యిల్లు వెడలగొట్టారట.

ఆమె నన్ను మనసార ప్రేమించి ఆత్మార్పణము చేసింది. ఆ పరిస్థితులలో నన్ను వెతుక్కుంటూ వచ్చి "నన్నేం చేయమన్నావు!" అని అడిగింది.

నాకేం తోచలేదు. ఆమెను నేను పెండ్లి చేసుకుంటానని మా తల్లిదండ్రులతో చెప్పాను. పెండ్లి కాకముందే బిడ్డను కన్నదాన్ని పెండ్లి చేసుకుంటానన్నందుకు నన్ను చీవాట్లుపెట్టి అలా పెండ్లిచేసుకునేట్లయితే తాము బావిలో దూకి చచ్చిపోతామని తయారయ్యారు. నాకు పిచ్చెత్తిపోయింది. ముందు నుయ్యి, వెనుక గొయ్యిలాగ పరిస్థితి ఏర్పడింది. కని పెంచిన తలిదండ్రుల మనసు నొప్పించి, వాళ్ళ ఆత్మహత్యకు కారకుడనై వాణిని పెండ్లిచేసుకొని మాత్రం సుఖపడనున్నది ఏమి లేదనిపించింది. పిరికిపందనై ప్రేమించి, ఆత్మార్పణముచేసి, నావల్ల జీవితమే తల్లక్రిందు చేసికున్న వాణిని పెండ్లాడ సమ్మతి చూపలేకపోయాను. ఆమె పుట్టెడు దుఃఖంతో ఎటు పోయిందో ఎక్కడికి పోయిందో తెలియదు.

నా మతి చలించింది. నా మూలంగా జీవితాన్నే ధ్వంసం చేసుకున్న వాణి దిక్కు, మొక్కులేని అనాథ అయిపోతే నేను మాత్రం బ్రతుకడం ఎందుకని యుద్ధ సర్వీసులో చేరాను. అక్కడా నన్ను ఏ బాంబూ, ఏ తుపాకీ, ఏ ఫిరంగి. నన్ను బలికొనకపోయినవి. తిరిగివచ్చి యిప్పటి ఉద్యోగంలో చేరాను. మా తల్లిదండ్రులు చనిపోయారు. యింతకాలం వాణి ఏమయిందో తెలియదు. నేను ఏకాకిగా జీవయాత్ర కుపక్రమించాను. ఈమె ఏ వాణి కుమార్తె. పన్నెండు సంవత్సరాల నాటి విషాద సంఘటన. వాణికి నేను చేసిన ద్రోహానికి ఆమె కుమార్తె నన్ను క్షమిస్తుందా! క్షమార్హుడనా!" అని ముగించాను.

మధు నన్ను ఓదారుస్తూ "జరిగిపోయినదానికి యిప్పుడు చింతించి చేయగలదేమున్నది! పశ్చాత్తాప పడి పితృహృదయంతో శాంతను స్వీకరించి వాణి ఆత్మకు శాంతిని కలిగించు" అన్నాడు.

నేను చెప్పుచుండినదంతా వినిన శాంత తన గుడ్డలు మూట కట్టుకొని బయలుదేరింది.

నేను, మధు శిలాప్రతిమలలాగ నిల్చుండిపోయాము. నేను దగ్గరకువెళ్లి "ఎక్కడికమ్మా! పోతున్నావు?" అన్నాను.

శాంత కన్నీళ్లతో ఏమి మాట్లాడకుండా రెండడుగులు ముందుకువేసింది. నేను ఆమెవెంట వెళ్ళి చేతిలోని మూట పట్టుకుని ఆపాను.

"బాబయ్యా! నన్ను వెళ్ళనివ్వండి" అన్నది కండ్లు తుడుచుకుంటూ.

"శాంతా! నన్ను క్షమించవూ! నన్నొదిలి వెళ్తావా!" అని ప్రాధేయపడ్డాను.

శాంత నీరసంగా నవ్వింది. అందులో అశాంతి లేదు, శాంతి లేదు. రాగము లేదు, ద్వేషము లేదు. దుఃఖము లేదు, సంతోషము లేదు, క్షణమాగి "వద్దు బాబయ్యా! నన్ను పోనీయండి. నేనున్నందువల్ల మీ మనసులోని బాధ తగ్గదు. మిమ్మలను కష్టపెట్టడం మా అమ్మ కిష్టంలేదు. మా అమ్మ ఎప్పుడూ ఎవ్వరినీ కష్టపెట్టి ఎరుగదట" అన్నది.

నేను "అమ్మకు నిజంగా ఎవ్వరినీ కష్టపెట్టడం యిష్టంలేదు. మరి నేనింత జబ్బుస్థితిలోనుంటే నీవు నన్నొంటరిగా వదలిపెట్టి పోయి నా మనసు కష్టపెట్టడం అమ్మకిష్టమగుతుందా చెప్పు!" అన్నాను ఆమె కండ్లలోకి చూస్తూ.

శాంత మాట క్రింద జారవిడచి భోరున ఏడ్చింది. నన్ను చెయ్యి పట్టుకొని మంచం దగ్గరకు పిలుచుకొని వచ్చి పడుకోబెట్టింది. ఆనాటినుండి నా మనస్సు శాంతించింది. క్రమంగా ఆరోగ్యం చేకూరింది. నేను, శాంత తండ్రీ బిడ్డలము.

శ్రీవత్సవారి
సుబ్
బారు సబ్బు
ఉతుకుటకు నిత్యము
ఉపయోగపడునది.
శ్రీవత్సకెమికల్స్ & డ్రగ్స్
(ప్రైవేట్) లిమిటెడ్
మద్రాసు-30.

AMRUTANJAN
The Pain Balm
Amrutanjan Limited
BOMBAY, MADRAS
అన్ని
నొప్పులకు
అమృతాంజనము

పండిత
డి. గోపాలాచార్యులవారి
అరుణ
స్త్రీల టానిక్
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్
మద్రాసు-17

# విరికన్నెతో

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ఇప్పుడిప్పుడే వికసించి యింపులు గురి
పించి పరిమళముల గుబాళింపజేసి
తేనె సోనల భృంగాళి తృప్తి పఱచి
ఒక్క అరగంటలో మాయ మొందనేల

కాంచనే లేదు కన్నుల కరవు దీర
అనుభవింపగనే లేదు మనసు దీర
కన్ను విచ్చిన దెంత ఆ కనులు ఋరల
మూసినది యెంత? తీరెనే ముచ్చటైన

మనసారదెచ్చి ప్రేమ పిపాసి హృదయేశ్వరికి సమర్పించు కానుకవు నీవు
ప్రాణాధికముగ సంభావించి పరమేశ్వరునికి భక్తుడొసంగు ధనము నీవు
దేశ సేవాతపో దీక్షితు గళసీమ ఘృణులీను దివ్యభూషణము నివు
కోమలిజనలోన గులుకుచు ప్రియు సుఖలీల నూగించు నుయ్యాలవీవు

ఇన్ని విధముల ధన్యత యింత స్వల్ప
కాలమున నెట్టు లార్జింప గలిగి తీవు!
ఎన్నితొలి జన్మ లందుగావించి నట్టి
పుణ్యమున విరికన్నెగా పుట్టినావో!

ఏ శిల్పి నేర్పుమై ఈ రంగుపూవు గావించెనో విందుగాక కనులకు
ఏ ఐంద్రజాలికుండీ పరిమళవైభవము గూర్చెనో ఘ్రాణపర్వముగను
ఏ రసాయన వేత్త యీ మరందామృత ధారగూర్చెనో జిహ్వాతనివిదీర
ఏ గాయకాగ్రణి యీ తేటి పాటలు గల్పించెనో విందుగా చెవులకు

మేనదాకిన హాయిగా మృదువుగా వి
రాజిలెడు రేకు లెట్టి నిర్మాత గూర్చె
నరుల పంచేంద్రియముల కానందమిచ్చు
ధన్య జన్మమ్ము విరికన్నె! దక్కె నీకు

ఇంత యమూల్యమైన బ్రతుకీనవయౌవనలక్ష్మి యింతలో
నంతము చెందుటల్ గన యథార్థపు తత్త్వము గోచరింపదే
ఎంతటి అందచందములు నెంతటి వైభవభోగ భాగ్యముల్
నంతయు నిల్వజాలవు వసుంధరనంచు ప్రసూన కన్యకా!

# మ ర్మ గు హ

శ్రీ సి. సి. పు న్న య్య

(సర్వహక్కులు రచయితవి)

(గతసంచిక తరువాయి)

(వకీలు రాఘవరావుగారి యిల్లు — హాలులో రాఘవరావు, భార్య మహాలక్ష్మి సోఫాలలో కూర్చొని మాట్లాడుకొంటుంటారు. రాజయ్య, నాగమణిని వెంటబెట్టుకొని వచ్చి ఎదురుగా బయట నిలబడతాడు)

రాఘవరావు:-ఎవరు మీరు? ఏం పని యుండి వచ్చారు?

రాజయ్య:-మాది పొరుగూరు బాబుగారూ!

రా:-అయితే ఎందుకు వచ్చినట్లు?

రాజ.-మేము పేదవారం. ఈమె నా కుమార్తె నాగమణి. ఈడొచ్చిన పిల్ల...

రా:-ఇంతకు నీవచ్చేది ఏమిటి?

రాజ:-ఏమీ లేదు బాబుగారూ! మాకు జరుగుబాటు చాల కష్టంగా నున్నది. మా అమ్మాయి మీ యింట్లో చాకిరి చేసుక బ్రతుకుతుంది. అందుకు మిమ్ములనడుగ వచ్చాను.

రా:-ఇదేమైనా ఆఫీసా మీకు ఉద్యోగం యివ్వడానికి!

రాజ:-నాకు కాదు బాబూ! మా అమ్మాయి మీ యింటిపనులు చేస్తుంది మీరు కనికరించి అవకాశమిస్తే.

రా:-పాపం! మీ పేదరికం మిమ్ములనిందుకు ప్రోత్సహించినట్లున్నది.

రాజ:-దాంతో దిగులు, విచారము తోడైనవి బాబుగారూ!

రా:-మిమ్ములను చూస్తే నాకు జాలిగా నున్నది. కాని మా యింటికి పనిమనిషి అవసరంలేదు. నిన్ను చూడబోతే బీదవాడవు. నీ బిడ్డ మహాలక్ష్మిలాగున్నది. నాకు పిల్లాజల్లా లేరు. ఇంట్లోనైనా భార్యాభర్తలం మేముతప్ప మరెవ్వరు లేరు. మా బిడ్డలాగ యింట్లోయుండి మాకు సహాయంగా నుండదలిస్తే మాకేం అభ్యంతరములేదు. మరి నీ పేరేమిటి?

రాజ:-రాజయ్య, మా అమ్మాయి పేరు నాగమణి.

రా:-చక్కని పేరు. కళాకాంతులకు తగినట్లుగా చక్కని పేరు. భగవంతుడు మీకు పొరబాటున సంపద సౌభాగ్యములకు బదులుగా దరిద్రము నిచ్చాడు. ఈ రోజునుండి మీ అమ్మాయి మా యింట్లో యుంటుంది.

రాజ:- మీ దయ బాబుగారూ! మీ బిడ్డగా ఒప్పగిస్తున్నాను.

రా.-ఏం బెంగ పెట్టుకోబోకు రాజయ్యా! అప్పుడప్పుడు వచ్చిపోతూండు.

రాజ:-అలాగే బాబూ! (కుమార్తెతో) అమ్మా! యింతవరకు నిన్ను పెంచాను. ఈరోజున వకీలుగారి దయవల్ల నీకీ ఆశ్రయం లభించింది. నాకు, నీకు కూడ మంచిపేరు తేవలసిన బాధ్యత నీ మీద యున్నది. స్త్రీగా పుట్టిన తరువాత ఏనాటికైనా ఎడబాటు యుండనేయుంటుంది. దాన్ని భగవంతుడీనాడు యిట్లా కలుగజేస్తున్నాడు. నీవు మంచిగా నుండమ్మా, అమ్మగారూ, వకీలుగారు నీకు తల్లిదండ్రులలాంటివారు. [illegible] మెలగుతూ జాగ్రత్తగా నుండమ్మా! నేను వెళ్లివస్తా!

నాగ:-(కంటతడిపెడ్తూ) అయ్యా!

రాజ:-ఉండమ్మా! ఉండు (వకీలువైపు తిరిగి నమస్కరిస్తూ) వెళ్లివస్తాను బాబుగారూ!

రా:-అలాగే - మంచిది వెళ్లిరా!

(రాజయ్య వెళ్లిపోతాడు)

◆ ◆ ◆

(జమీందారు భవనం. ఇంట్లో వల్లి పనిచేస్తుంటుంది. రాగయ్య కంగారుగా "వల్లీ! వల్లీ" అని పిలుస్తూ వస్తాడు. వల్లి తలవంచుకొని మారుమాట్లాడకుండా పనిపాటులలో నిమగ్నమై యుంటుంది)

రాగయ్య:-అరె! చోద్యంగా నున్నది. చెవిటివాళ్లను పనిపాటులకు పెట్టుకుంటే మహాబెడద బాబూ! ఎంతగట్టిగా అరచినా చెవులు వినపడవాయె!

వల్లి:-(రుసరుసలాడుతూ తల పైకెత్తి) చూడూ! మాటలు జాగ్రత్తగా రానీయ్! నేను చెవిటి దాన్నికాదు, గ్రుడ్డిదాన్నీ కాదు. నీవు వచ్చిన పని చూసుకొని అవతలికెళ్లు.

రాగయ్య:-నేను వచ్చినపని చూసుకోడానికి కాక పోతే నీ ప్రక్కన కూర్చోడానికా వచ్చాను!

వల్లి:-ఆ — ఏమిటన్నావ్!...

రా:-ఏముందీ... చిన్న బాబుగారు ఎక్కడున్నారని...

వల్లి:-చిన్నబాబుగారు నా ఒళ్లోనా యుంటారు? ఆయనవెంట తిరిగేవాడివి నీకు తెలియాలి - నాకెలా తెలుస్తుందీ!

రాగ:-అబ్బో! నీ పలుకే బంగారమయిందే - చూడు వల్లీ... ఒక్క మాట...

వల్లి:-మాటలేదు, గీటలేదు. ఇకమీదట నన్ను పిలవ దల్చుకుంటే వల్లియమ్మా! అని పిలువు. వల్లి, గిల్లి అని పిలిచావా - జాగ్రత్త!

రాగ:-"అలాగే లెద్దూ! 'అమ్మ'ను మినహాయించి 'వల్లీ' అని పిలవడం తప్పైనట్లున్నది! పోనీలే - యికమీదట అమ్మా వల్లీ! అని పిలుస్తాలే.

వల్లి:-నాపేరు ఎవరిదనుకున్నావ్! శ్రీ సుబ్రహ్మణ్య స్వామి భార్యది —

రాగ:-అవును - ఆనాడు సుబ్రహ్మణ్యస్వామి ఆ వల్లిని చేబడితే యీనాడు నేను నిన్ను...

వల్లి:-ఆ! నన్ను చేబడతావా! అవునవును - నీ వాలకం, వేషం అందుకు తగినట్లేయున్నవి. చాలు చాలు! యిక ముందిలాంటి అధికప్రసంగము చేశావంటే కొంపలిరుసుతాయి.

రాగ:-అవును లే — నాకు బాగా తెలుసు; ఆడ వాళ్లంతా మొట్టమొదట యిలాగే మాట్లాడుతారు.

(జమీందారు కుమారుడు శివప్రసాద్ లోపలికి వచ్చి)

శివ:-అవును లేవోయ్! నీకీ ప్రపంచంలో తెలియనిదంటూ ఏమీ లేదు.

(వల్లి ప్రక్కగదిలోకి వెళ్లిపోవును)

రాగ:-బాబుగారూ! చాల దూరంనుండి వస్తున్నట్లుంది!

శివ:-అవునుకానీ - నీవిక్కడికి ఎందుకు వచ్చినట్టు! ఏం చేసున్నట్లు?

రాగ:-మిమ్ములను వెతుక్కుంటూ వచ్చాను బాబు గారూ!

శివ:-నిజంగా నన్నా లేక వల్లినా?

రాగ:-మిమ్ములను వెదకివెదకి కాళ్లిద్దుకపోతున్నవి.

శివ:-అవును — నీ ముఖమే చెప్తున్నది-వల్లితో సరసాలాడటం లేదూ నీవు!

రాగ:-అదేమిటి బాబుగారూ! ప్రొద్దస్తమానం మీ వెంట నుండేవాడను కదా! అంతకంటె ముఖ్యమైన పని మరేముంది నాకు? అవసరమయితే నా ప్రాణాలను సయితం మీ కర్పిస్తాను.

శివ:-ప్రాణం అంటే బెల్లంగడ్డ కాదురా నాకివ్వడానికి - నేనెక్కడికిపోయినా నా వెంట యుంటే అది చాలులే!

రాగ:-తప్పకుండా బాబుగారూ!

శివ:-సరేగానీ — నాన్నగారేరీ!

రాగ:-మేడమీద నున్నట్లున్నారు.

శివ:-ఉన్నారేమో చూడిరా (రాగయ్య వెళ్ళిపోతాడు) వల్లీ!

వల్లి:-(వంట యింట్లోనుండి బయటికివచ్చి) పిలిచారా బాబుగారూ!

శివ:-పనిపాటలు మానేసి మీ యిద్దరి ఆర్భాటం ఎక్కువై పోతున్నట్లుంది.

వల్లి:-(సిగ్గుతో తలవంచుకొని) అదేంలేదు బాబుగారూ!

శివ:-నాకు తెలుసులే - సరే వెళ్లు (చిరునవ్వుతో వల్లి యింట్లోకి వెళ్లును. రాగయ్య మేడ మీదనుండి తిరిగివచ్చును.)

శివ:-ఏం రాగయ్యా! నాన్నగారు లేరా?

రాగ:-ఉన్నారు బాబూ! (విచారంగా) పెదబాబు గారు హాలులో పెద్దపటము ముందు నిలబడి కంట తడిపెడ్తున్నారు.

శివ:-ఏమిటిరా అది! పదపోదాం మనంకూడా అక్కడికి (రాగయ్య, శివప్రసాద్ యిద్దరు మేడ మీదకు వెళ్తారు. జమీందారుగారు పటంముందు నిలబడి కన్నీరు కారుస్తుంటారు. శివప్రసాద్

వెళ్ళి ఆయన ప్రక్కనచేతులు కట్టుకొని నిలబడతాడు.)

జమీ:_ప్రసాద్ బాబూ! (కండ్లు తుడుచుకుంటూ) నీకొక రహస్యం యీనాడు చెప్పబోతున్నాను. ఈ ఫోటో మీ యమ్మది. నిన్ను కని యిరవై సంవత్సరాల క్రితం చనిపోయింది. నీకు తల్లిలా గుంటూయుండి పెంచి పెద్దవాణ్ణిచేసింది దాసీ.

శివ:-నిజంగా నా నాన్నగారూ! యీ విషయం యింతకాలం ఎందుకు దాచియుంచారు? నన్ను కన్నతల్లిని యీ స్థితిలో చూడవలసి ఏర్పడినదా! (ఏడ్చును).

జమీ:_అవును బాబూ! నిన్ను పెంచి ముచ్చటలు, అచ్చటలు తీర్చుకోవలసిన తల్లి నిన్ను కన్న మరుదినమే చనిపోయింది.

శివ:-(పటంవంక చూస్తూ పొంగిపొరలే దుఃఖంతో) అమ్మా! నన్ను నీవు తల్లికి కరువైన వానినిగా చేసి వెళ్లావా! మనసార అమ్మా! అని నీవు వింటుండంగా ఒక్కసారైనా పిలువడానికి నయితం నోచుకోనివాడనా తల్లీ! అమ్మా! అమ్మా! (వలవల ఏడ్వసాగును).

జమీ:_మీ యమ్మకేం నాయనా! అదృష్టవంతురాలు. పుట్టెడు దుఃఖాన్ని, నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేయవలసిన బరువు బాధ్యతలను నా నెత్తిన పెట్టి పోయింది. ఇంతకాలం అష్టకష్టాలుపడి నిన్నింతటివాణ్ణిగా పెంచాను. నేనూ పెద్దవాణ్ణయినాను. ఇక జమీందారీ వ్యవహారములను నీకు ఒప్పజెప్పదలచుకున్నాను. ఇకమీదట నీవే నిర్వహణ బాధ్యతలను స్వీకరించాలి.

శివ:-మీరుండగా నాకిప్పుడే యీ బాధ్యతలెందుకు నాన్నగారూ!

జమీ:_అలా కాదు నాయనా! నేనేం శాశ్వతంగా బ్రతికియుండేవాడను కాదు. పైగా మునుపటి ఓపిక, శక్తి ఉడిగిపోయినవి. నేనుండగానే నీవు బరువు బాధ్యతలు వహించి సమర్థుడవనిపించుకుంటే నేనూ చూచి సంతోషిస్తాను. కీర్తిప్రతిష్టలతో వర్ధిల్లు నాయనా!

శివ:_నాన్నగారూ! అదంతా మీ ఆశీర్వాదబలం.

జమీ:-ప్రసాద్ బాబూ! పోదాం పద - భోజనం వేళ అయింది.

♦ ♦ ♦

(రాజయ్య పూరిగుడిసెలో ఒంటరితనాన్ని గురించి వాపోవుచూ యుంటాడు)

రాజ:_ఎందుకీ నాకీ జీవితం! కన్నబిడ్డను కూటికి గుడ్డకు కరువై యీడొచ్చినా పసులపంచకు వెట్టిచాకిరికి పంపి నేనేం సాధించాలని బ్రతుకడం? నాకు, నా బిడ్డకు సరిపోయే ఆదాయమేయుంటే నాబిడ్డ యీనాడిగం చాకిరిచేస్తూ ఎవరినో ఆశ్రయించుకొని యుండవలసిన అవసరం ఏముంటుంది! ఇక నీ కూలిడబ్బులతో జీవయాత్ర సాగించడం దుర్భరం. నేనూ పట్నంలో చిన్న నౌకరి సంపాదించుకోగలిగితే, జీతం డబ్బులు పెట్టుకొని నేను, మణి ఒకేచోటయుంటూ యుండవచ్చును. దేనికైనా భగవంతుని తోడ్పాటుకూడా కావాలి కదా!

♦ ♦

(పెద్దబ్యాంకు. చాలమంది ఉద్యోగులు పని చేస్తుంటారు. వచ్చేపోయేవారి కోలాహలం ఎక్కువగా నుంటుంది. మేనేజరు గదిలో కూర్చొని కాగితాలపై సంతకాలు పెడుతుంటాడు. రాజయ్య ఎదురుగా పోయి నిలబడుతాడు.)

మేనేజరు:-(తలకాయ పైకెత్తి చూచి) ఎవరు నీవు? ఏం కావాలి?

రాజ:-(ఏమి మాట్లాడకుండా నిలబడియుంటాడు.)

మే:_మాట్లాడవేం! ఏమి కావాలి నీకు?

రాజ:_(నమ్రతతో) ఏదైనా నౌకరి దయచేయాలి!

మే:-తమాషా మనిషిలాగున్నావే!

రా:_అదేమిటండీ! అలాగంటారు?

మే:-మరేం చెప్పేది! బి.ఏ.లు, యం.ఏ.లు వందలకొలదిగా ఉద్యోగాలకని విధి విరామం లేకుండా తిరిగిపోతుంటే—

రాజ:_అయియుండవచ్చు. నాకు బంట్రోతు పని చాలునండీ!

మే:_దానికీ చదువుండాలి, దాంతోబాటు అదృష్టం కలిసిరావాలి.

రాజ:_బాగుందండీ యీ లోకం పోకడ!

మే:_అది నీవొక్కడవే కాదయ్యా! లోకమంతా కోడై కూస్తున్నది.

రాజ:_బంట్రోతు పనికీ చదువు కావలసివస్తే యిక మా బోటివారిది అధోగతే - మరి మీరేం చదువుకున్నారండీ!

మే:_ఏమిటీ గోల! అది అంతంలేకుండా యుంది. ఇక్కడ పనిలేదు పాటులేదు నీకు - త్వరగా బయటికెళ్లు - నాకు చాల పనియుంది.

రాజ:_క్షమించండి! కనికరించి ఏదైనా చిన్న

నౌకరిప్పించండి! అన్ని ఉద్యోగాలను, నౌకరీలను చదువుకున్న వాళ్ళకే యిస్తే మాబోటివారిపట్ల దయచూపేది ఎవరండీ!

మే:_ఏమీ అవకాశంలేదు _ వెళ్లు.

(రాజయ్య కాళ్లీడ్చుకుంటూ బయటికి వెళ్ళి గేటుమెట్లను ఆనుకొని కూర్చొని మేనేజరుకు కోపం తగ్గిన తరువాత మరొకసారి ప్రాథేయపడదామని యింటాడు. అలా కూర్చొని కునికిపాట్లుపడుతూ నిద్రపోతాడు. సాయంకాలం 6 గంటలు కాగానే ఆఫీసుకు తాళం బిగించి నిద్రపోతున్న రాజయ్యను బంట్రోతు లేపుతాడు).

బంట్రోతు:_ఇది పడుకొని నిద్రపోవడానికి సత్రమనుకున్నావా! లేచివెళ్లు!

రాజ:_(కళ్లు నులుపుకుంటూ లేచి) మేనేజరుగారున్నారా?

బం:_మేనేజరుగారు యింటికి వెళ్ళిపోయి చాల సేపయింది. నేనూ త్వరగా యింటికి వెళ్ళాలి _ మా అమ్మాయి నాకొరకు ఎదురు చూస్తుంటుంది. (గేటు తలుపులు వేసి తాళం బిగించి యింటికి వెళ్ళిపోతాడు)

రాజ:_అవును _ నాగమణికూడ నాకొరకు ఎదురు చూస్తుంటుంది. అయినా దరిద్రుణ్ణి _ నీకు కూడు, గుడ్డ యివ్వలేక వెట్టిచాకిరికి ఒప్పగించాను. నా కొరకు పరితపించి మాత్రం లాభమేమిటి తల్లీ! (అని తలపోస్తూ పడుకొన్ని గేటు ప్రక్కనే నిద్ర పోతాడు.)

ఆఫీసులోపల ఏదో పెట్టెను పగులకొడుతున్న శబ్దం. రాత్రి పన్నెండు గంటల సమయం. ఇనుప పెట్టె పగులగొట్టి డబ్బు దోచుకొని పారి పోతుంటే డబ్బా ఒకటి కాళ్లకడ్డంపడ్డ శబ్దానికి రాజయ్య ఉలిక్కిపడి నిద్రనుండి లేచి పారి పోబోతున్న దొంగను పట్టుకొని "దొంగ! దొంగ!" అని గట్టిగా అరచాడు.

దొంగ:_ఏయ్! నోరు మూయ్! నోరెత్తావంటే చస్తావ్! (ఈడ్చి చెంపమీదకొడతాడు.)

(రాజయ్య, దొంగ పెనుగులాటలో రాజయ్య అరపులకు చుట్టుప్రక్కలవాళ్లు వచ్చి గుమి కూడారు. రాజయ్య దొంగ చేతుల్లోని నోట్ల కట్టను, సంచిని లాక్కున్నాడు. దొంగ పారి పోబోతుంటాడు.)

రాజ:-పట్టుకోండి! పట్టుకోండి దొంగను. ఈ డబ్బు దోచుకపోతుంటే పట్టుపడ్డాడు.

దొంగ:-(తమాయించుకొని) ఎవడురా దొంగ? చూడండి మీరే వాడి చేతులలోని దానిని. నేను సమయానికి రాకపోయనట్లయితే ఈ డబ్బంతా తీసికొని పరారైపోయేవాడే.

రాజ:-(ఆశ్చర్యంతో) నేనా దీనిని దొంగిలించింది?

దొం:_మరెవ్వరు? డబ్బు సంచులతో కూడ పట్టుబడి దబాయిస్తున్నావే!

రాజ:-(తబ్బిబ్బులాడుతూ) నీవు తీసికొని పారి పోతుంటే కదా నీ చేతిలోనుండి లాక్కున్నది! ఆ మాట్లాడేవాడే దొంగ! పట్టుకోండి!

(అక్కడ గుమికూడిన జనంలో నొకడు గద్దిస్తూ "ఏయ్! దొంగవెధవా! డబ్బుతో కూడ పట్టుబడి యింకా దబాయించడం కూడానా! పట్టకోండి వీడిని" అని అరిచాడు. అందరూ "పట్టుకోండి! చావ కొట్టండి వెధవను!" అని వంతపలికారు. ఈ సందట్లో అసలు దొంగ తప్పించుక పారి పోయాడు)

రాజ:_ఏమిటీ అన్యాయం! నేను దొంగను కాను బాబూ! నేను బీదవాడిని; కూలినాలి చేసికొని బ్రతికేవాడిని. నా కష్టాలు, బాధలు ఎన్ని యున్నా దొంగతనం ఎరుగను. నా భార్య చని పోయింది. నాకు, నా ఒక్కగానొక్క బిడ్డకు ఎడబాటు ఏర్పడింది. జీవనోపాధి వెతుక్కుంటూ యిక్కడికి వచ్చాను. ఇక్కడ మేనేజరు నౌకరి లేదు పొమ్మన్నాడు. నేను ఆవేదనతో కుప్ప కూలిపోయి యీ గేటుప్రక్కనే పడుకొని నిద్ర పోయాను. ఏదో శబ్దమై లేచి చూచేసరికి టార్చి లైటు వెలుతురు, దొంగ కనుపించాయి. 'దొంగ! దొంగ!' అని అరుస్తూ అతనిని పట్టుకొని పెనుగు లాటలో యీ సంచిని, నోట్లకట్టను అతని చేతి నుండి లాక్కున్నాను. నా అరపులకు మీరంతా వచ్చి గుమికూడారు. (అక్కడివారంతా అంతకు ముందు తర్కించుచుండిన వ్యక్తికొరకు కలయ జూచారు. వాడెప్పుడో పారిపోయాడు.) నిజా నికి, ధర్మానికి పాటుపడ్డ నేను మీ కండ్లకు దొంగనైనాను.

(సశేషము)

# అల్లుడి వెంబడి గిల్లుడు

శ్రీమతి చివుకుల లక్ష్మీపున్నయ్య



అవధాన్లు యూరంతా తిరిగినా ఒక్క యింట్లోను భోజనం పెట్టినవాళ్లు లేరు. పాపం ఆ గ్రామంలోని రెండు వందల బ్రాహ్మణ యిండ్ల గడపలు ఎక్కి-దిగాడు. ఆకలితో ఆరాటపడుతూ ఎండలో తిరిగి తిరిగి ఒక యింటి పంచలోని అరుగుమీద చేరగిలబడి కునికిపాట్లు పడసాగాడు. సాయంకాలం అయిదుగంటల ప్రాంతమున ఆ యింట్లోనుండి ఒకముసలావిడ బయటికి వచ్చి అవధాన్లను లేపి ''ఎవ్వరండీ! మీరు? ఏదో నీరసంగా కనుపిస్తున్నారే! భోం చేసినట్లు లేదు !'' అని అడిగింది.

మండిపోతున్న ఆకలితో, ఆక్రోశాన్ని వెళ్లగ్రక్కుతూ ''నేనెవరినయితే ఏం లేమ్మా! యీ యూరి మొత్తం మీద నీవైనా నన్ను భోం చేసినట్లు లేదేయని పరామర్శించావు'' అన్నాడు.

''అదేమిటండీ యింత పెద్దగ్రామంలో ఒక్కయింట్లోను భోజనం దొరకలేదా !'' అన్నది ముసలావిడ.

''లేదమ్మా! అయినా యీ రోజులలో ఎవరి పొట్టవారు నింపుకోడమే కాని పారమార్థిక చింత ఎక్కడుంది ! '' అన్నాడు అవధాన్లు,

''అయ్యో ! పాపం! మా యింట్లోనైనా పెడదామంటే మాయింటికి క్రొత్త అల్లుడు పండుగకు యీ ఆరుగంటలబండికి వస్తున్నాడు. ఇంట్లో అందరు పిండివంటలు, శాకపాకాలు తయారుచేస్తూ తీరిక లేకుండాయున్నారు. లేకపోతే అన్నానికేం భాగ్యం !'' అంటూ లోపలికి వెళ్లి తలుపు గొళ్లెం వేసికుంది. ఇంట్లోనుండి వెలువడే శాకపాకాల, పిండివంటల గుమాయింపులు అవధాన్ల నోరూరించసాగినవి. కాని నిరాశ, నిస్పృహాలు ఆవరించి ఏమి చేయడానికి తోచక దీర్ఘాలోచనలో పడ్డాడు.

రాత్రి ఏడుగంటలకు అల్లుడు పెట్టెలు, బేడలతో టాక్సీలో వచ్చిదిగాడు. అవధాన్లు గబగబా వెళ్ళి టాక్సీ తలుపు తెరచి అందులోని వెండికూజా, సంచి తీసికొని అల్లుడి వెంబడే యింట్లోకి వెళ్లాడు. అల్లుడు అవధాన్లు మామగారి బంధువనుకొన్నాడు. మామగారు అల్లుడి వెంట వెండికూజా, సంచీ అవధాన్లు తేవడం చూచి ఆయన వియ్యాలవారికి దగ్గరబంధువై యుంటాడనుకున్నాడు. అల్లుడితోబాటు అవధాన్లకు అన్ని మర్యాదలు జరిగినవి. రాత్రి అల్లుడి పంక్తిన షడ్రసోపేతంగా అవధాన్లు విందారగించాడు. మరునాడు దీపావళి - అల్లుడికి తలగడుగు స్నానం, నూతన వస్త్రాలు; ఆయనతో బాటు మర్యాదకు లోటులేకుండా అవధాన్లకుకూడాను. ఇలా నాలుగు రోజులూ వియ్యాలవారి బంధువని మామగారు, మామగారి దగ్గరబంధువని అల్లుడు ఎవరికివారు అనుకుంటూ విందులు, మర్యాదలతో అవధాన్లకు గడచిపోయింది. అవధాన్లు సయితం యింట్లో చొరవజేసికొని అత్యంత సన్నిహితుడులా వ్యవహరించడం చూచి యింట్లోవాళ్లు అల్లుణ్ణిగాని, అల్లుడు

మామగారునున్నను ఇంట్లో వారినిగాని అవధాన్లనుగురించి, బాంధవ్యమును గురించి అడుగ సాహసించారు కారు.

ఒక రోజున భోజనాల దగ్గర మాటల ప్రస్తావనలో అల్లుడు "మామగారూ! అవధాన్లగారిని మీరెప్పుడు నాకు పరిచయం చేశారు కారే! మీకు ఆయన ఏమవుతాడేమిటి?" అని అడిగాడు.

మామగారు "అదేమిటి! అలా అడుగుతున్నావు! ఆయన నీ వెంటవచ్చాడుకదా మీ బంధువేమోననుకుంటున్నాము" అన్నాడు ఆశ్చర్యంతో.

మజ్జిగఅన్నము తింటున్న అవధాన్లు "మామ, అల్లుళ్లు మీరిద్దరు నేనుమీకేమవుతానని తర్కించుకోడం చాలా బాగున్నది! భోంచేసి చేయికడుక్కొనియండి - నేనే చెప్తాను" అంటూ త్వర త్వరగా భోజనం ముగించి చేయికడుక్కొడానికి లేచి వెళ్లాడు.

మామ అల్లుళ్లు భోజనం ముగించి లేచి చేతులుకడుక్కొని అవధాన్లు ఎక్కడ యున్నాడాయని యిల్లంతా వెదకి చూచినా ఎక్కడున్నాడూ?

---



శ్రీమతి బి. కే. వెంకటరమణమ్మగారు 1950 నుండి ఆదర్శ మహిళా సంస్థను రాజమహేంద్రవరమున స్థాపించి నిర్వహించు చున్నారు. ఇందులో అనాథలైన బీద బాలికలకు హిందీ, ఆంధ్ర మెట్రిక్, ఇ.యస్.యల్.సి., నేత, లేసు అల్లకం, కుట్టుపని మొదలగు వానిలో ఉచిత భోజన, నివాస వసతులతో శిక్షణ గరపబడుచున్నది. ప్రభుత్వముచే గుర్తించబడి, ఒక సంవత్సరము ఆంధ్రమహిళా సంక్షేమ బోర్డువారు నిర్వహణకు సహాయపడ్డారు. 1955 లో తాడేపల్లిగూడెంలో దీనికి బ్రాంచి ఏర్పడింది. తర్వాత యిక్కడ శిక్షణపొందిన శ్రీమతి పాలెపు శారదాంబగారు ఝాన్సీ మహిళా విద్యాలయం అనే పేరుతో బందరునందు యిట్టి సంస్థనే నెలకొల్పి నిర్వహిస్తున్నారు.

శ్రీమతి రమణమ్మగారు యీ మధ్యనే చనిపోయారు. ఆమె కృషి ఫలితంగా యీ సంస్థలు యింతవరకు సమర్థంగా నిర్వహించబడుటయేకాక వర్ధిల్లుతూ వచ్చినవి. ప్రస్తుతము శిక్షణపొందుతున్న 50 మంది విద్యార్థినులకు హాస్టలు వసతిలేక యిబ్బందిగానున్నది. హాస్టలు నిర్మాణానికని తపిస్తూ శాశ్వతంగా కండ్లుమూసిన శ్రీమతి రమణమ్మగారి నిర్యాణమునకు సానుభూతి సంతాపములను తెలుపుటతో బాటు ఆమె పూనుకున్న ప్రజాహిత కార్యక్రమాలను ప్రోత్సహించి ప్రజలు, ప్రభుత్వము హాస్టలు నిర్మాణానికి తోడ్పడవలసియున్నది. దానివల్ల ఆమె పవిత్రాత్మకు శాంతి చేకూర్చినవారు కాగలరు.

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 22

సాయంకాలం నాలుగైంది. రామచంద్రుడు ఆడుకుందుకు వెళ్ళాడు. మాలిశ్యాతల్లి అంట్లు తోముతోంది. ఆమె స్వయంగా తన పనేదో తానే నిర్ణయించుకుంటుంది. గ్రామంలో వున్నట్లుగానే యిక్కడకూడా యెక్కడికీ వెళ్ళేదికాదు. ఎవరికైనా బ్రాహ్మణులకు సేవచేస్తే పరలోకంలోనైనా బాగుపడతామనుకుని — యిక్కడ తిని కూర్చోకుండా పని చెయ్యడం మొదలుపెట్టింది. అదే ఆమెకు సంతృప్తి. సావిత్రిదేవి కూడ ఆమెను ప్రేమగా చూస్తుంది.

కుమార్ అప్పుడే నిద్రలేచి ముఖం కడుక్కుని తుడుచుకుంటూ ప్రక్కనే కూర్చుని తమలపాకులకు సున్నం రాస్తున్న తల్లిని చూచాడు. ఆమె ముఖంలో విచారరేఖలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. తనకా సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చింది తల్లివల్లనే. ఎదుట వ్యక్తిని గురించి ఆలోచించడంకూడా తల్లివల్లనే నేర్చుకున్నాడు. తాను యెన్ని విధాలుగా తల్లిని తిరస్కరించినా ఆమె బాధపడలేదు. ఈనాడు ఆమె ముఖంలో కన్పించే ఆవేదనను తొలగించడం తన విద్యుక్తధర్మం. మంచంమీద కూర్చుని ఆలోచిస్తూ చూస్తున్నాడు. తల్లి ఆవేదనకు కారణమేమిటి? అనేకవిధాల ఆలోచించాడు. ఆఖరికి ఒక విషయం అతడి మనస్సుకు తట్టింది. తనకు వివాహం కాలేదు. కారణం? సమాజంలో తనకు గౌరవం, మర్యాద లేవు. అందువల్లనే అమ్మ విచారంగా వుందనుకున్నాడు, సామాజిక మర్యాద అనే భావన రాగానే "ఎల్లాంటి మోసం!" అనుకున్నాడు. ఇప్పుడు అమ్మ కష్టపడాల్సిన అవసరంలేదు. ఇదివరకటికంటె యిప్పుడు రోజులు బాగానే వున్నాయి. "ఆనాడు నేను విదేశాలకు వెళ్ళకుండా వుంటే నీకీనాడు మనస్సు ప్రశాంతంగా వుండేది కదమ్మా" అన్నాడు ఆమెవైపు చూస్తూ.

కొడుకు మాటకు ఉలిక్కిపడి, మనసులోని ఆవేదనంతనూ అణచుకొని, పైకి తెలియకుండా చిరునవ్వుతో "ఆ?" అంది.

"ఇంత పెద్దదానవైనా — విశ్రాంతి తీసుకోవలసిన వయస్సులోకూడ కష్టపడాల్సి వచ్చింది కదూ!"

"అవును నాయనా! ఇంతవరకు సహాయంగా వుండేవాళ్ళు రాలేదు" అంది పళ్ళెంలోని తమలపాకుల వైపు చూస్తూ.

"ఏం చెయ్యను? ఎవ్వరూ దొరకటంలేదు: లేకపోతే యీ పాటికి తీసుకువచ్చి యింట్లో కూర్చోపెడుదును."

ఆ మాటకు నవ్వి తమలపాకులు యిస్తూ, "యెవతైనా వచ్చినా నాచేత రెండు పనులు యెక్కువ చేయిస్తుంది" అంది నవ్వుతూ. తల్లి కమల గురించే యీమాట అన్నదని కుమార్ ఆలోచించలేదు. కొడుకు తనమాట అర్థంచేసుకోలేదని ఆమె గ్రహించి, "రామలోచనబాబు కూతుర్ని మొదట యెక్కడ చూచావు బాబూ?" అంది.

"అదంతా పెద్దకథలే" అంటూ జరిగిన విషయం సంక్షిప్తంగా చెప్పి నవ్వాడు. సావిత్రిదేవి అంతా విని, కమల, నిరుపమలలో యెవరు కుమార్ మనసుకు దగ్గరగా వున్నారోనని ఆలోచించి, "అయితే నువ్విప్పుడు కమల దగ్గరికి వెళ్ళాలా?" అంది.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా, "నిరుమల్లీ యెప్పుడైనా వచ్చిందా?" అన్నాడు మధురస్వరంతో.

"లేదు — మల్లీ రాలేదు" అంది తల్లి అతి సహజంగా.

తొందరగా పోదామనే దృష్టితో కుమార్ బట్టలు వేసుకొంటున్నాడు. ఇంతలో నీలి వచ్చింది. హాలులోవున్న కుమారును చూచి నవ్వి సావిత్రిదేవితో చెప్పింది, "అక్క పెళ్ళి నిశ్చయమైంది. వచ్చే సోమవారం రాత్రికి పెళ్ళి" అంటూ గబగబా చెప్పేసింది. ఆమాట సావిత్రిదేవికి చటుక్కున అర్థం కాలేదు కుమార్ కూడ మాట్లాడకుండా బట్టలు వేసుకుని మేడమెట్లు దిగాడు. గుమ్మందాకా వచ్చేసరికి అక్కడొక ఉత్తరం కన్పించింది. అడ్రసు మాత్రం సావిత్రిదేవి పేర వుంది. తల్లి పేర ఉత్తరం

వ్రాసేదెవరని ఆలోచిస్తూ దాన్ని తీసుకుని మళ్లీ మేడ యెక్కాడు. పైకి యెక్కుతున్నంతసేపు అడ్రసు కేసి చూస్తూనే వున్నాడు. కాని అక్షరాలు గుర్తుపట్టలేకపోయాడు. పై మెట్టువరకు యెక్కి, "అమ్మా, నీకేదో ఉత్తరం వచ్చింది" అంటూ నీలిని పిల్చి ఆమె చేతికిచ్చాడు. వెంటనే అక్షరాలు గుర్తుపట్టింది. అది అక్క వ్రాసినదేనని నిశ్చయించుకుని "అక్క యామినీబాబును చేసుకోదు. కుమార్ బాబునే చేసుకుంటుంది. అందుకనే ఉత్తరం వ్రాసింది. యామినీబాబు పేరు చెప్తేనే అక్కకు అసహ్యం" అని మనసులోనే అనుకుంటూ వుత్తరాన్ని సావిత్రిదేవికిచ్చి, "మా అక్కకు యామినీబాబంటే యిష్టంలేదు. కాని మా నాన్నగారే చేస్తున్నారు బలవంతాన" అంది.

సావిత్రిదేవి చేతిలోవున్న ఉత్తరాన్ని చించడం మరచిపోయి, నవ్వుతూ, "అయితే మీ అక్క యెవ్వర్ని కోరుకుంటోంది?" అంది.

నీలి సమాధానం చెప్పకుండా కుమార్ వైపు చూచి నవ్వి వూరుకుంది. సిగ్గుతో కుమార్ ముఖం యెరుపెక్కింది. తల్లియెదుట యెప్పుడూ అంత సిగ్గుపడలేదు అతడు. ఉత్తరం యిచ్చి వెళ్లాల్సినవాడు అదేమిటో విందామనే కుతూహలంతో అక్కడే నిలబడ్డాడు. ఆ వుత్తరంలో యేముంటుందో అతడు ఊహించుకున్నాడు. ఏమి వ్రాసిందోనని తల్లికూడ ఆలోచిస్తూనే వుంటుంది. ఇక తను అక్కడ వుండడం మంచిది కాదనుకుని నెమ్మదిగా మేడమెట్లు దిగడం ప్రారంభించాడు. ఇంతలో చేతిలోవున్న ఉత్తరాన్ని చింపుతూ, "బాబూ, కాస్సేపు ఆగు" అంది తల్లి. వెంటనే వెనక్కుతిరిగి దిగిన రెండు మెట్లు పైకి యెక్కాడు. ఉత్తరాన్ని చదవమని అతడికి అందిచ్చింది. మడతవిప్పి చివర సంతకం చూచాడు. నిరుపమ. అతనిలో కుతూహలం యెక్కువైంది. ఆ పేరు కన్పించగానే అతని కళ్లు చీకట్లు క్రమ్మాయి. ఒక్కక్షణమాగి చదవడం ప్రారంభించాడు. "అమ్మా!" అని ప్రారంభించింది అలా అనడంలో ఆమె అభిప్రాయమేమిటో? "నేను మీ యిల్లు కోన్నాను — మీకోసమనే. భగవంతుని దయవలన నాకు వచ్చే సోమవారం వివాహం. పెళ్లైన తరువాత రామచంద్రుడి చదువుకి కావలసిన యేర్పాట్లు చేస్తాను. మిమ్మల్ని కలుసుకొందుకు బహుశా యిప్పుడు సమయం వుండదు — మీ స్నేహసౌహార్ద్రాలను కాంక్షించే - నిరుపమ."

చదవడం పూర్తవగానే కుమారుకు మత్తెక్కినట్లైంది. చేతిలోని ఉత్తరాన్ని అక్కడే పడేసి గబగబ మేడమెట్లు దిగి వెళ్లిపోయాడు. నీలికేదీమీ అర్థంకాక రామచంద్ర తల్లివైపు చూచింది.

సావిత్రిదేవి ఆ ఉత్తరాన్ని పదేపదే చదువుకుని దానివైపు చూస్తూ ఆలోచనతో అట్లాగే వుండిపోయింది. కాగితంమీద వున్న ఒక మరకమీద పడింది ఆమె దృష్టి. ఒక అక్షరం చెరిగిపోయింది. అదేమీ సిరామరక కాదు. ఆ చెరిగే చెరగనట్లున్న అక్షరాన్నే చూస్తూ ఆలోచిస్తూ నిశ్చయించుకుంది. ఇది వర్షపునీటి మరకకూడ కాదు. ఒకవేళ నిరు కిటికీదగ్గర కూర్చుని వ్రాసినప్పుడు యేమైనా నీరు పడ్డాయేమో! నీలిని నెమ్మదిగా అడిగింది - "నీలీ! మీ అక్క యెక్కడ కూర్చుని వ్రాసింది యీ వుత్తరం?"

"నాకు తెలీదు" అంటూ సావిత్రిదేవి ముఖంలోకి వింతగా చూచి, "ఏం?" అంది.

సావిత్రిదేవి ఒక్కక్షణమాగి, "అసలు సాధారణంగా యెక్కడ కూర్చుని వ్రాస్తుంది?" అడిగింది మళ్లీ.

"తన గదిలోనే".

"కిటికీ దగ్గర టేబులు వుందా?"

"లేదు...గోడవైపుకు వుంది" అనేసి, యీ యక్షప్రశ్నలన్నీ యెందుకోనని ఆలోచించడం మొదలుపెట్టింది నీలి.

"గోడవైపు వుందా" —అనుకుంటూ యీ కాగితంమీద వున్నది కన్నీరేనని నిశ్చయించుకుంది. ఆ కన్నీటిమరక కుడిచేతివైపు చివర వుంది. అందువల్ల యిది కుడికంటి నీరే అనుకుని మళ్లీ ఉత్తరం చదవడం మొదలుపెట్టింది. "భగవంతుడి దయవల్ల"- ఆ మాట పదేపదే మననం చేసుకుని ఒక నిర్ణయానికి వచ్చింది - "అమ్మా నీలీ! నాకొక చిన్న సహాయం చేస్తావా?" అంది.

నీలి పూర్తి సానుభూతి చూపిస్తూ 'చేస్తాను' అంది.

"ఎవ్వరితోను చెప్పకూడదేం?"

"అలాగే".

"అయితే అక్కతో చెప్పు. నీ ఉత్తరం చదివింది. నువ్వెంతవరకు అమెను కలుసుకోలేవో అంతవరకు ఆమె యేమీ గ్రహించుకోలేదు. అందువల్ల రేపు నిన్ను తప్పకుండా కలుసుకోమంది" అని చెప్పు.

"అక్కను నేను తీసుకువస్తాగా" అంది నీలి నవ్వుతూ.

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(ఏప్రిల్ సంచిక తరువాయి)

౩౧

రాక్షస తిమిరంబుఁ బ్రధ్వంసన మొనర్చు
  భాస్కరుండవు నీవు – పరమ పురుష
భక్తుల పాపముల్ బరిహరించెద వీవు
  మునులు ధ్యానించెడు ఘనుఁడవీవు!
దుర్మార్గులకు నీవు – దూరస్థుఁడైనావు
  శత్రుల శిక్షింపఁ జాలి నావు
తాళవృక్షము లేడు లీలఁ బ్రద్దలుగాఁగ
  చీల్చిన మేటివి శ్రీరమేశ!

ఇంద్రుఁడెపుడు సేవలింపార సల్పును
జలధరముల బోలు శ్యామలాంగ;
రామ! నిన్ను సతము ప్రార్థన మొనరింతు
రక్షణంబు సలుపు – రాఘవేశ!

౩౨

గోపాల! భూపాల! గోవర్ధనోద్ధార!
  రాక్షసనాశనా! రాఘవేశ!
సీతామనోనాథ! శ్రితజన మందార!
  ఓ! దయా సాగరా! ఓ ముకుంద?
ఓ! సద్గుణాంభోధి! ఓ విభీషణ రక్ష!
  నవపద్మ నేత్ర! పుణ్యశుభగాత్ర!
ఓ! కోటి శ్రీమన్మథాకార! శ్రీరామ!
  శుభగుణచారిత్ర! సుందరాంగ!

నన్నుఁ బాలించుచున్నావు - నాగశయన!
నిన్ను మించిన రక్షకుఁడున్నవాడె?
చిత్తనైర్మల్య మొసఁగుము శ్రీనివాస!
రాఘవా! సదానిన్ను స్మరణ మొనర్ప.

౩౩

ప్రణవాబ్జ రత్నప్రభల్ జిమ్ము సింహాస
  నంబుఁ సాకేతపురంబు నందు
శోభిల్లు: శ్రీరామ! శుభగుణధామ! సీ
  వందు, భూజాతతోనుందు వెపుడు
వికచ పద్మముఖులు – వింజామరలఁ బూని
  యిరు పార్శ్వములను, సేవించు చంద్రు
వరము నీశ్వరులు; విశ్వామిత్రులాదిగా
  నిను, నుతించుచునుంద్రు – నీరజాక్ష!

శిష్ట సంరక్షణ మొనర్చి – దుష్టశిక్ష
సలుప, రామావతారంబు నెలమిఁదాల్చి
వచ్చినాడవు; జోహారు లిచ్చినాము
రమ్యగుణభద్ర! రక్షింపు! రామభద్ర!

౩౪

మందార మాలికానందమూర్తివి నీవు
  మెఱుపు గుంపులఁ బోలు – మేటి వస్త్ర
ము, ధరించినాఁడవు; ముద్దుగా, సంపూర్ణ
  చంద్రునిఁ బోలెడి చారు మొగము
గల్గినవాఁడవు! కమలంబులఁ దెగడు
  నేత్రంబులను గల్గు నీరజాక్ష ॥
దిక్పతుల్ సేవింప – దివ్యుఁడై వెల్గెదు
  శ్యామలాకార! శ్రీ రామచంద్ర!

అగరు కర్పూర శ్రీచందనార్ద్ర హృదయ!
శ్రీమనోహర! రఘువీర! చిత్ప్రకాశ!
సత్యసంకల్ప హృదయ! విచారశీల!
రక్షణ మొనర్పవయ్య! శ్రీరామచంద్ర!

౩౫

రెండు బాణముల, దోర్దండులగు, సుబాహు
మారీచులన్ బరిమార్చి; నీవు
కౌశికు యజ్ఞంబుగాచిన వాఁడవు
నీలమేఘ శ్యామ! నిగమవినుత!
లక్ష్మణసంస్తోత్ర! రాజీవనయన: ప
ద్మాస్య! దయానిధీ! మాప్రియుండ!
సొగసుగులుకు పిల్ల - జుట్లచే, సుందరా
కారుండా, శ్రీరామ! కలుషహరణ!

నిన్నుధ్యానింతు, భజియింతు - నెమ్మన
మున
నిశ్చల సమాధి, పరిశుభ్ర నిష్ఠ, నియతి
తపజపంబులు యోగ నిద్ర సమకూర్చి
నీదరికిఁ జేర్చుకొమ్మ శ్రీ నీరజాక్ష!

౩౬

ఆనంద రూప! దివ్య గుణసమేత!
నీలోత్పలాంగ! ఖండిత శత్రుజాల
భువనైక మిత్ర! స్వర్భువనాధికార!
రవికులభూషణా! రాజీవనయన!
శ్రితజన మందార! శ్రీ నాథ! వరద!
పతిత పావనరామ! వరద! ప్రసన్న
సింహాసనాసీన! సీతాసమేత!
రాఘవా! భజియింతు - రక్షింపు దేవ!

౩౭

రణరంగ మందు, శ్రీరామ భద్రుండు
అసురమూకలనెల్ల - నాశ్చర్యభంగి
బాణ వర్షంబున - ప్రహరించి, దునిమి
శిష్టుల రక్షించె - శ్రీకరంబుగను
ఆ విభీషణుఁడు, దన్నాశ్రయింపంగ
రక్షించి, సింహళ రాజ్యంబొసంగి
పట్టాభిషేకంబు భాసురంబుగను
సల్పె, నాతనికి నాశతవందనములు

౩౮

గజ వాహనుండు, విఖ్యాతనాముండు
ఉపనిషత్తులకెల్ల - నోంకార పూజ్యుఁ
డభిమాన రహితుండు హరి-ముకుందుండు
స్వకృతైక దానపూజ్యత నొంది యుండు
శ్రీరామచంద్రుండు - శ్రితజన భక్త
నాశన శూన్యుండు - న్యాయైకమూర్తి
దేవతారాధ్యుండు; దివిలోకభర్త
నా మ్రొక్కులను గొంచు-నను రక్షసలుపు.

౩౯

శ్రీ ధనుర్బాణముల్ - జే, ధరియించి
శత్రుల మర్దించు - శ్యామలాంగుండు
సీతా సమేతుండు శ్రితరక్షకుండు
కమలలోచనుఁడు, సంకటనాశకుండు
లక్ష్మణ సేవ్య, నీరజపాదయుగ్మఁ
డార్త బాంధవుఁడు, దయాంతరంగుండు
శ్రీరామ మూర్తి - రక్షించుత సతము.

౪౦

పాపార్తి భంజనా! భద్రాద్రి రఘు
రామ!
దీనబాంధవరామ! మౌనివినుత!
సీతామనోనాథ! శ్రితజనమందార!
భరతాగ్రజా! శ్రీనివాస! వరద!
రఘువంశనాయకా! రామచంద్రా! కరు
ణాకరా! శ్రీధర! నాగశయన!
భయ, పీడితులయిన - భక్తులదీనుల
నాప్త బాంధవులట్టులరయు వాఁడ!

కలుషమైన, సంసారాంధకారమందు
మునిగి కనుఁగానకున్నాము; వనజనేత్ర!
పాప సంద్రంబు మముజుట్టె భక్తవరద!
కరుణ రక్షింపు శ్రీరామ! శరణు! శరణు

౪౧ (౧)

బహుళరంధ్రయుతము-బడిపోవుయంత్రంబు
శిథిలమై, క్రమమునఁజెడి, శరీర
మవని నాశనంబు - నందుట సత్యంబు
తెలివిఁగల్గి దీని తెలియవలయు

౪౧ (౨)

మూఢ ! దుర్మతీ ! నీ వీని గూఢమైన
మర్మము నెఱుంగు మెప్డు ; రామ, సుక
థామృ
తంబు పాన మొనర్ప రోగంబు రాదు
యతని నామౌషధంబె - దివ్యౌషధంబు
'రామకథ'యను నమృతంబు ద్రావు
మయ్యా!

౪౨

దశకంఠ గజము, నుత్సాహంబుతోఁజీల్చు
మృగరాజవై నావు - శ్రీశ ! నీవు
భయద, హస్తములతో-భండనంబొనరించి
రక్కసగర్వంబు నుక్కడంచి
రంజిల్లు తారక బ్రహ్మస్వరూపుఁడై
దశరథ వరపుత్ర ! ధర్మహృదయ !
మణి ఖచితకిరీట ! మంజుల భాషణా !
శ్రీరామ చంద్ర ! యాశ్రితజనంబు
రక్షణ మొనర్చుచున్నావు - రాఘవేశ !
కమల లోచన ఇందిరా రమణ ! నిన్ను
భక్తి సేవించి భజియించి పాడుకొందు
రక్షసేయుము ; శ్రీరామ ! రాఘవేంద్ర!

౪౩

లంకా వినాశనా ! రణరంగభీమ
రాజీవనేత్ర ! ఓ రఘువంశమిత్ర !
కారుణ్యమూర్తి ఓ ! కరుణా ప్రపూర్ణ !
రక్షింపు శరణిదే ! రాఘవచంద్ర !

౪౪

రాకేందువదన ! శ్రీరామచంద్రుండ !
వేదాంతములయందు - వెలసియున్నావు
బ్రహ్మనిర్వాను తించు భక్తుఁడై సతము
హృదయస్థుఁడై నీవు - మెదలుచున్నావు
భవవంద్య ! శ్రీరామ ! ప్రార్థింతునిన్ను

౪౫

పద్మ సద్వశ, మృదుపాదయుగ్మముతోడ
భాసిల్ల జేతువీ వసుధతలము -
తల్లి ముదము నెందఁదండ్రి యంకమునందుఁ
గూర్చున్న వాఁడవు కోమలాంగ !
నల్లని కలువల కన్నులు గల్గిన
మరకత మాణిక్య మహితదేహ !
దేవతాతతినిన్ను సేవించి స్తోత్రముల్
సల్పుచుందురు, రామచంద్ర ! సతము
సకలభూషణాలంకార! సార్వభౌమ
మాయచే రాముఁడైన, యుమామహేశ !
నాదు మనమున్గఁ బాడగట్టి సాదరమున
రక్షణము సల్పవయ్య ! శ్రీరామచంద్ర !

(సశేషము)


## కటకరసాయనం

బాహ్య, అంతర్గత మూలవ్యాధి చికిత్సకు దివ్యౌషధము. ఇందులో ప్రమాదకరమైనట్టియు, అలవాటుకలుగజేయు ఓషధు లేవియు చేరియుండలేదు. రుచికరంగాను, సులభముగా సేవించుట కనువుగానున్నది. వివరములకు:

కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్
మద్రాసు — 14.




శ్రీమతి పతానేని శ్రీశైలలక్ష్మమాంబ

(గత సంచిక తరువాయి)

ఎదురుగా మంచంమీద ముకుందరావు హాయిగా గుండెలమీద చెయ్యివేసుకు పడుకున్నాడు. అర్ధరాత్రి వేళ పిడుగులు పడ్డట్టుగా తలుపులు గుద్దిన చప్పుడుకి ప్రక్కనున్న రాణీ లేవడంచేత కొంచెం కళ్లువిప్పి గుమ్మంవైపు చూస్తున్నాడు. ఎదురుగా భర్తకన్పించేసరికి శ్యామలకి ఒక్కసారిగా దుఃఖం పొంగి పొర్లివచ్చింది. కాని ఆ సమయంలో ధైర్యం చిక్కపట్టుకొని "మా అబ్బాయికి చాలా జబ్బుగా వుంది వారిని ఓసారి పంపించండి" అంది నెమ్మదిగా

ఈమాటవిని ఉలిక్కిపడి లేచి మంచం మీద కూర్చున్నాడు ముకుందరావు.

"మీరెవరమ్మా? ఎవరికోసం వచ్చారు?" అనడిగింది రాణి —

"నేను ముకుందరావుగారి భార్యను - మా బాబు చాలా ప్రమాదస్థితిలోవుండి నాన్నకోసం కలవరిస్తున్నాడు — ఒక్కసారి అర్జంటుగా వారిని పంపించండి. బాబునిచూడాలి" అంది ఎంతో బాధతో శ్యామల —

అంతలో ఆయాసపడూ, రొప్పుకొంటు రొజుకొంటూ, ఒగర్చుకొంటూ అక్కడికొచ్చింది వేశ్యమాత —

"ఏమండి? మీ అబ్బాయికి జబ్బుగావుందా?" అంది రాణి —

"ఏమో! నాకు తెలీదు రాణీ! నేనింటికెళ్లి అప్పుడే నెలకావస్తోంది" అన్నాడు ముకుందరావు.

"అదంతా ఒట్టినాటకం - మొగుణ్ణిలాక్కుపోవడానికి వేసిన ఎత్తు" అంటూ గుమ్మందగ్గరగా వచ్చి చెప్పింది వేశ్యమాత —

"నా మాటనమ్మండి - బాబుకి జబ్బు చాలా ప్రమాదస్థితిలోవుంది. డబ్బులేకుండా డాక్టరుగారు రానన్నారట. రామయ్యగారినీ అనసూయనీ, బాబు దగ్గరవుంచి మీకోసం వచ్చా-త్వరగా రండి"

"అబ్బో! నీలాంటి సంగనాచుల్ని చాలసినంతమందినిచూచాను - పెళ్లాంపోయిన రామయ్య నీ యిల్లు పట్టాడుగా — ఇంకా మొగుడెందుకు? ఎంతటి జాణవూకాకపోతే — గేటుదాటి గోడలు దూకి అర్ధరాత్రి రాగలధైర్యశాలివి నువ్వెంతటి పనికైనా సాహసించగలవు. వెళ్లు చాల్లే నీ నక్కజిత్తులు" అంటూ ఎంతో ఈసడింపుగా అంది వేశ్యమాత —

"ఏమండీ! మన బాబుకోసంరారూ?" ఎంతో దుఃఖభారంతో భర్తముఖంలోకి దీనంగా చూస్తూ వేడుకుందామె —

"వస్తారులెండి — మీరు వెళ్లండి" అంది నిర్లక్ష్యంగా రాణి —

"మన బాబు నాన్నా నాన్నా అంటూ కలవరిస్తున్నాడు - త్వరగా రండి. మీకోసమేవచ్చాను ఈ ఒక్కసారి నామాటవినండి. మీకాళ్లు పట్టుకువేడుకుంటా — మన అబ్బాయి..." అంటూ శ్యామల ముకుందరావు రెండుకాళ్లూ పట్టుకుంది —

రాణికళ్లు, తల్లి కళ్లు కల్సి ఏదో సంజ్ఞాపూర్వకంగా మాట్లాడుకొంటున్నాయి — కన్నతల్లి కడుపుమంటలో తల ఎత్తిచూచే స్థితిలోకూడా ఆమెలేదు— కన్నీళ్లతో భర్త పాదాలను తడుపుతూ కన్నకొడుకు కోసం రమ్మని ప్రార్థించుకొంటూంది — అతని మనస్సు కూడా ద్రవించి పోతోంది —

"తెల్లవారాక వెళ్లొచ్చు — త్వరగా ఆమెను

పంపించండి - అర్ధరాత్రివేళ ఏమిటీ ఘోష కొంపలో — ఇదంతా నటనగాని నిజమనిమాత్రం నమ్మకండి" అంది రాణి —

ముకుందరావు మనస్సు దేవేస్తోంది. తనఇల్లాలుతో సమానమైన ఉత్తమురాలు లేదని అతని అంతరాత్మకు తెలుసు. ఆమె కలలోకూడా అబద్ధమాడని పరమపావని అని అతని హృదయం ఘోషిస్తోంది పాదాల మీద భార్య, ప్రక్కన ప్రియురాలు అతనిలోని మానవత్వం ఘోష పెడ్తోంది — బిడ్డకోసం ముందుకు పోవాలా? ప్రేయసికోసం ఆగిపోవాలా? కొన్ని క్షణాలు ఆలోచిస్తూ అలాగే నిల్చుండి పోయాడు — అతనిలోని పితృప్రేమ, ప్రియురాలి ప్రేమక్షణకాలం పెనుగులాడాయి. పశివాడి ప్రాణంకోసం తహతహతో తల్లి తన పాదాలమీద మోకరించింది. నవ్వించి. కవ్వించి ఆనందపర్చే వేశ్య ఆగమంటోంది. తను ఇప్పుడు రాణిమాట కాదని వెళ్ళిపోతే తిరిగి ఈ గుమ్మంత్రొక్కనీయరు. ఎముకల పుట్టవంటి భార్యతో తను సుఖించలేడు — చివరకు అతనిలోని కామమేజయించింది. స్వార్థం పిరికితనం అతనిలో ఆవేశించాయి —

"ఈ అర్ధరాత్రి సమయంలో నేనువచ్చి మాత్రం చెయ్యగలిగిందేముంది? ప్రొద్దున్నేవస్తాను; నువ్వు వెళ్ళిపో!" అని దులబరించుకు తనపాదాలు రెండూ ముందుకు తీసుకు మంచందగ్గరకు వచ్చాడు అతడు -

"చెప్పారుగా - ఇంకత్వరగా ఇక్కడనుంచి వెళ్ళిపొండి," అంటూ నిస్సాకారంగాచెప్పి రాణి కూడా మంచందగ్గర నిల్చుంది -

ఆ మాటతో శ్యామలలోని సహనమంతా నశించింది. లేచి నిల్చుంది. "రాణీ! నువ్వుమాత్రం పిల్లలుగల తల్లివికావా? కడుపులో కార్చిచ్చుపెట్టడానికి సిద్ధంగా వున్న కన్నకొడుకుని వదలి కట్టుకున్నభర్త కోసం నీ యింటికివచ్చి అర్థించి అడుగుతున్నా. యీ ఒక్క రాత్రికి నా భర్తని పంపించు — రాణీ! నాకూ నా బాబుకీ వీరు తప్ప లోకంలో "నా" అన్నవాళ్లెవరూ లేరు. సాటి ఆడదాని బాధ, కష్టం అర్థంచేసుకు ఒక్కసారి పంపించు — ఇవి నీ చేతులు కావు కాళ్లుగా భావిం నా బాబుకోసం ..." ఇంక చెప్పలేకపోయిం —

"సంసారివైనా బలే యాక్షన్ చేస్తున్నావు! ఇంతబాగా అభినయించటం నేనెక్కడ చూడలే ఇంతవరకు" అంటూ దర్జాగా అంది రాణి —

"రాణీ! నువ్వు వృత్తికి వేశ్యవైనా మానవత్వం మాతృత్వం అయినా నీలోవుండి సాటి స్త్రీ మీద జాలిపడి నీ ధర్మాన్ని నువ్వు నెరవేర్చి నా భర్తను పంపిస్తావనుకొన్నాను. కాని సానులైనవారి మనస్సులు సానరాళ్లవంటివనుకోలేదు—నీచురాలా! కావాలంటే వచ్చి నాబాబు ఏస్థితిలో వున్నాడో కళ్లతో చూడు — ఈ నాడు కండకావరంలో కళ్ళు కప్పి కన్న తండ్రినీ బిడ్డనుంచి దూరంచెయ్యకు. నా భర్తని పంపించు నువ్వు పంపకపోతే నేనే తీసుకువెడ్తా—నేను వారి భార్యని" అంటూ రాణీని ఓ చీడ పురుగుని చూచినట్లు చూచి భర్తముందు నిల్చుంది శ్యామల -

"ఏయ్! మాటలు తిన్నగా రానీయ్! అర్ధరాత్రిప్పుడు దొంగలా నాయింటికెవరు రమ్మన్నారు. నీకాపాటి శక్తివుంటే నీ భర్తని ఎల్లాతీసుకెడ్తావో నేనూ చూస్తా. నువ్వు కొట్టుకుచచ్చినా ఆయనీరాత్రికి రారు. ఏంచేస్తావో చెయ్యి!" అంటూ అతడి ముఖంలోకి చూచింది రాణి —

భార్యముఖంలోని దీనత్వం, కళ్లలోని కన్నీరు కంటే, వెలయాలి ముఖంలోని చిరునవ్వే అతన్ని బంధించివేశాయి.

"నేను వస్తానని చెప్తుంటే నీక్కాదూ? ఇక్కడినుంచి వెళ్ళిపో" కఠోరంగా ఆజ్ఞాపించాడు అతను —

ఆ మాటతో ఆమెలో ఆవేశం దుఃఖం ఎక్కువయ్యాయి" అదేంమాటండీ? కన్నకొడుకంటే ఒక్క రాత్రికి మీ ఆనందం ఎక్కువా? కట్టుకొన్నభార్య, కన్న బిడ్డ అక్కడదురంత దుఃఖంలోవుంటే ఇక్కడ మీరు వినోదంగా వుంటారా? ముందు బాబుదగ్గరకి రండి. తండ్రిగా వాడిని పల్కరించి బ్రతికించండి" అంటూ రుద్రకాళీ స్వరూపందాల్చి అడిగింది ఆమె—

"నేను రాను — ముందు ఇక్కడినుంచి కదుల్తావా? లేదా?" గర్జించాడు అతడు —

"రావాలి! బాబు కోసం మీరువచ్చితీరాలి!! నాకన్నకొడుకంటే నాకేం ఎక్కువలేదండి!!!" అంటూ ఉద్రేకంతో భర్తచేతిని గట్టిగాపట్టుకు బరబరా ముందుకులాక్కొచ్చింది ఆమె - ఆమె భయంకర స్వరూపానికి ఒణికిపోతూ రెండడుగులు ముందుకి వేశాడు ముకుందరావు —

"ఆ [illegible] తీసుకువెళ్ళడానికి వీల్లేదు" అంటూ

అరుస్తూ ఓ చెయ్యిరాణి! రెండో చెయ్యి వేశ్యమాత పట్టుకున్నారు.

"ముందు నాతోరండి" అంటూ అతని చొక్కా పట్టుకులాగింది శ్యామల –

"మొగ మహారాజువి చెప్తున్నా కాని వినని అడది భయభక్తులున్న దేనా? రెండు తన్ని గెంటిపారేస్తే కదలకేం చేస్తుందంట?" అంటూ ప్రబోధంచేసింది వేశ్యమాత –

కావల్సిన కార్యక్రమాన్ని కళ్లతోనే చెప్పింది రాణి – దుర్బలుడైన భర్త "పోతావా పోవా?" అని రెండు తన్నాడు ఆ మహాసాధ్విని -

"బాబు మనబాబు కోసం రండి–కన్న కొడుకు-పోనీ అయిదురూపాయిలివ్వండి. బాబును బ్రతికించుకుంటాను." అంటూ క్రిందపడిన ఆమె గోడు గోడున ఏడ్చింది.

అ కర్కశహృదయాలముందు ఆమె రోదన అరణ్యరోదన అయిపోయింది. మేడ మెట్లమీంచి క్రిందకి త్రోసి వెయ్యబడింది.

"మీరు మనుషులా, రాక్షసులా? కడుపెడు దుఃఖంతో వచ్చిననన్ను ఇల్లాచేస్తారా?" అంటూ నుదురుమీంచీ, చేతులమీదనుంచి రక్తం కారుతోన్నా లెఖ్ఖచెయ్యకుండా కొడుకుకోసం ప్రాణాల్నికూడా తెగించిపోరాడేందుకై లేచి నిల్చుంది ఆ సాధ్వి –

హృదయ విదారకమైన ఆమె ఆక్రందన ఆ మదాంధులు వినకుండా బరబరా గేటు బయటకు ఈడ్చివేసి తాళంవేశారు - భోరున ఏడుస్తూ బాబు కోసం పరుగెత్తుకువచ్చింది. బాబు సన్నగామూల్గుతున్నాడు: ఆమె భీభత్సరూపాన్ని చూచి రామయ్య అనసూయ హడలిపోయారు –

"నా బాబుని ఇంకెవ్వరూ బ్రతికించలేరా?" అంటూ అరచింది ఆ తల్లి –

"అమ్మాయీ! కష్టాల్లోవున్న వాళ్లనే దేవుడు పరీక్షిస్తాడు. ఇంకమనం చెయ్యవల్సిందేమీలేదు – అంతా దైవనిర్ణయం" అని నిట్టూర్చి చెప్పాడు రామయ్య –

"డాక్టరుగారి కాళ్లు పట్టుకుతీసుకొస్తే నా బాబు బ్రతుకుతాడేమో?" ఇంకా ఆశపీడిస్తూంటే అడిగింది

"అన్ని విధాలా నేనడిగానమ్మా! ఇంక ఆయన వస్తాడనుకోవద్దు" అన్నాడు బాధగా రామయ్య -

"పోనీ ముకుందరావుగారు పనిచేసే కొబ్బరికొట్లో వారిని ఏమైనా డబ్బుఇమ్మంటే...ఇప్పుడు లేసార్తా?" కళ్లంట నీళ్లతో చెప్పింది అనసూయ.

ఇంక ముందు వెనకా ఆలోచించే శక్తినికూడా లేకుండా పిచ్చిదానిగా చేస్తోంది ఆమెలోని మాతృప్రేమ. ఆరాటంతో ఆ రక్తమయమైన ఆకారంతో ఒళ్ళుతెలీకుండా కొబ్బరికొట్టు వైపు పరుగెత్తింది ఆ మాతృమూర్తి - గేటు దగ్గరకు వెళ్ళి "బాబూ" పొలికేక పెట్టింది శ్యామల -

భయంకరమైన ఆమె అరుపుకి ఆ దగ్గర్లోనే చల్ల గాలికి నిద్రపోతున్న కొట్టు యజమాని కొడుకు శ్రీధరం ఖంగారు పడ్తూ ఎవరువారు? అని అడిగాడు–

"బాబూ! నాకొడుకు చాలా జబ్బులోవున్నాడు– ఒక్క అయిదు రూపాయిలివ్వండి. – రేపు ముకుంద రావుగారికిచ్చే సొమ్ములో తీసుకోండి - మాకొడుకుని బ్రతికించుకొంటాం:" అంది హృదయ విదారకమైన రోదన స్వరంతో –

"ఎవతమ్మ? అర్ధరాత్రి వేళ ఆడదానవు వంటరిగా వచ్చావు? అంటూ టార్చి లైటుతీసి చూచి ఆమె అవతారంగమనించే హడలిపోయాడు అతడు.

"బాబూ! పేదరాలిని. నాకన్నకడుపుని కాపాడండి. ఒక్క అయిదు రూపాయలివ్వండి. డాక్టరుకిచ్చి నా బిడ్డని బ్రతికించుకుంటా. నా బాబే నాకు ఆధారం" అంటూ ఏడుస్తూ చెప్పింది.

"అమ్మా నడవండి – నేను వస్తా" అంటూ అతడు టార్చి లైటు వేసిదారి చూపిస్తున్నాడు. వెనక అతడు వస్తూంటే ముందామె పరుగెత్తుతోంది -

గబగబా ఆ దుర్గాగా తలుపులు బాది "డాక్టరు గారూ!" అంటూ అరుస్తోంది అమె. అంతలో శ్రీధరం వచ్చి మీరు ఆగండమ్మా! నేను పిలుస్తాను అని "మిస్టర్ డాక్టర్ నేను శ్రీధరాన్ని–సీరియస్ కేస్. అర్జంటు" అన్నాడు తలుపుదగ్గర - ఆ పిలుపుకిక్షణంలో తలుపు తెరుచుకుంది- "త్వరగారండి చాల ప్రమాదస్థితిలోవున్న కుర్రవాడట" అని పది రూపాయిల కాగితం చేతులోపెట్టేసరికి వెంటనే బయల్దేరాడు వైద్యనారాయణుడు. బాబుని చూచి పెదిమివిరిచాడు.

"డాక్టరుగారూ ! నా బాబుని బ్రతికించండి. నా చిట్టితండ్రి బ్రతుకు మీచేతుల్లోవుంది ! " అంది ఆమె ఏడుస్తూ –

"డాక్టర్ ! అపస్రవానికి చెయ్యవలసినంత వైద్యం చెయ్యండి – డబ్బునేనిస్తా – ఇక్కడే వుండండి " అన్నాడు ఆతృతగా శ్రీధరం -

డాక్టరు శ్రీధరంకూడా అల్లాగే రెండుగంటలసేపు బాబుకోసం ఎంతో శ్రమపడ్డారు కాని ఇంకా గంట రాత్రివుండగనే డాక్టరు బాబు ముఖంమీదగుడ్డ కప్పేసరికి ఘొల్లుమంది గర్భశోకంతో ఆమాతృమూర్తి–

♦ ♦ ♦

"అమ్మాయీ ! శ్యామలా ! శ్రీధరంగారు చెప్పినట్లే చెయ్యడమే మంచిదమ్మా ! అతని మనసులోని చీకటిని పోగొట్టి ఎప్పటికైనా మీ సంసారంలోకి వెలుగువచ్చేలా చూడకపోతే ఎల్లాగమ్మా ? నీకు తండ్రివంటివాణ్ణి. ఎందుకు చెపుతున్నానో వినమ్మా ! " అంటూ ఎంతోదూరం చెప్పిన తర్వాత చిట్ట చివరకు గత్యంతరంలేక అంగీకరించింది శ్యామల -

ముకుందరావు కొట్లో జీతం పుచ్చుకుపర్సుజేబులో పెట్టుకుని హుషారుగా, వుల్లాసంగా పాటపాడుకొంటూ నడుస్తున్నాడు - కొట్టుదాటి వీధిమలుపు తిరిగేసమయంలో వెనకనుంచి అతని ముఖంపై ఎవరో తువ్వాలుపడేసి రివ్వున జేబులోపర్సు తీసుకు సైకిలుమీద వెళ్లిపోయ్యాడు. పాపం మనిషిని గుర్తించలేక సైకిలు వెళ్లినవైపు పరుగెత్తాడు. కాని మనిషి పత్తాయేలేదు - కొట్టు గుమ్మందగ్గర సైకిలు దిగుతూన్న శ్రీధరాన్ని చూచి "ఏమండీ ! ఇటువైపు ఇప్పుడే ఎవరైనా సైకిలుమీద వెళ్లడంచూశారా?" అనడిగాడు ముకుందరావు –

"తెలీదండీ - నేను అల్లావెళ్లాలని ఇప్పుడే బయటకి వస్తున్నా" అన్నాడు శ్రీధరం.

తన పర్సు కొట్టేసినవానికోసం ఓగంట నానా తంటాలుపడిచివరకు నిరాశతో రాణి ఇంటికివచ్చాడు-

డబ్బుకోసం చూస్తూన్న రాణి, ఆమె తల్లికూడా ఖాళీజేబుతోవచ్చిన ముకుందరావుని ఈసడించారు. – వచ్చేనెలకు ఇవ్వబోయే జీతమైనా అడిగితెస్తానని కొట్టుదగ్గలకు వచ్చాడు ముకుందరావు –

కొట్టుయజమాని, అతని కొడుకు శ్రీధరంకూడా తమకింక గుమాస్తా అక్కర్లేదని ముకుందరావుఉద్యోగానికి వీడ్కోలిచ్చి సాగనంపారు – వారంరోజులు అతడు ఎక్కడికి నౌకరీకోసం వెడితే అక్కడే శ్రీధరం కన్పిస్తుండడం, తనకి ఎక్కడాపని దొరక్కపోవడంతో రాణీదగ్గరకు వచ్చి తనకష్టాన్నంతా చెప్పుకొన్నాడు – "డబ్బులేకుండానిన్ను కూర్చోపెట్టుకు మేపడానికి నేనేమీ కట్టుకున్న పెళ్లాన్ని కాదు పో ! పో"మ్మని అనాడు తనభార్యకి జరిగిన పరాభవమే తనకిచేసి గేటుబయటకి సాగనంపారు -

ఆనాడు రాత్రి తనభార్య వచ్చి వెళ్లాక ఈపక్షం రోజులూకూడా బాబు ఏమయ్యాడో అతనికి గుర్తురాలేదు. కాని ఈ నాడు మాత్రం ఇల్లాలు, ఆమె కార్చినకన్నీరు, తను పెట్టినబాధలు కళ్లముందు కన్పిస్తుంటే పూరింటికి పరుగెత్తాడు – లోపలికి వెళ్లేసరికి శ్యామల వంటచేస్తోంది - బాబుని తల్చుకుని ఆదంపతులు ఇద్దరూ భోరున ఏడ్చారు. వారం రోజులున్నా కాని అతనిలో భార్యపై నిజమైన అనురాగం ప్రేమ కలగకపోగా ఎప్పటికైనా తను మళ్లా ఇంకో ... అపమారానికే పోవాలనుకుంటూ, నౌకరీ వెతుక్కోవడానికి బయటికిపోయాడు -

సాయంత్రం ముకుందరావు ఇంటికి వచ్చేసరికి శ్యామల మరో అందమైన ఇరవైఏళ్ల యువకుడు చాప మీదకూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు – లోపలికి వచ్చిచూచి అల్లాగే నిర్ఘాంతపోయి నిల్చుండిపోయాడు ముకుందరావు –

కృత్రిమ అలంకారాలేమీలేని సహజ సౌందర్యంతో చిక్కిపోయి బక్కపలచగాయున్నా ఎంతో అందంగావుంది శ్యామల ముఖం. తలనిండా మల్లెపూలు తెల్లనిచీర, నల్లనిజాకెట్టు ఆమె పచ్చనిశరీరానికి ఎంతో అందంగావున్నాయి. మెళ్లో నల్లపూసలు. పసుపుకొమ్ము కట్టుకున్న బొందు. చేతికి గాజుని గాజులు తప్పించి ఇంకేమీలేకపోయినా ఎంతో అందంతో ఆనందంతో వెలిగిపోతున్నట్లుగా వుంది. ఇన్నాళ్లూ ఆమె తన సొత్తేనన్న ధీమాతో బానిసగా పడివుండాలనే భావంతో వుండే ముకుందరావుకి ఆమెలోని అందంచూడాల్సిన అవసరం కన్పించలేదు. కాని ఈనాడుఆమె ప్రక్కన మరో యువకుడు వుండడంతో తనభార్యలోని అందాన్ని స్పష్టంగా చూడగల్గాడు. ఆమె వల్ల ఆపరాయి వ్యక్తి ఎంతటి ఆనందాన్ని పొందగలడో ఊహించుకోసాగాడు. మళ్ళీ అంతలో ఇంకో ఆలోచన. ఇన్నాళ్లు తన భార్య అందమైనదీ బలమైనదీ కాదని,

తనని ఆకర్షించే యవ్వనం ఆమెలో లేదనేకదా! తను అపమార్గంపట్టాడు? ... మళ్లీ ఆ యువకునివైపు శ్యామలవైపు తీవ్రంగా చూచాడు. కాని తనువచ్చినట్లుకూడా వారిద్దరూ గుర్తించకుండా ఆనందంలో మైమరచిపోయి కిలకిలా నవ్వుకొంటున్నారు, తన భార్యలోకూడా ఎంతో ఆకర్షణ, యవ్వనం, సరదాలు వున్నాయి. కాని తనే ఇన్నాళ్లూ గుర్తించుకోలేకపోయాడు. అయితే యీ పరాయి వ్యక్తి ఎన్నాళ్ళనుంచి తనభార్యతో - ఇంకా ఆలోచించుకోలేకపోయాడు. అసూయాజ్వాలలు చుట్టుముట్టాయి. కోపంతో కంపించిపోయాడు. పట్టశక్యంగాని అహంకారంతో "ఏయ్! ఈతడెవరు?" అని గర్జించాడు —

"నాకు తెల్సిన స్నేహితుడులెండి. ఓ సారిచూచిపోదామనివచ్చాడు" అని భర్తకి చెప్పి లేచినిల్చుంది శ్యామల —

కోపంతో ముకుందరావు ముఖం కందగడ్డలా అయిపోయి ఆ యువకుని ముఖంలోకి చురచురా చూచాడు —

అతడు నవ్వుకుంటూ లేచి నిల్చుని "శ్యామలా! మరి నే వెళ్తొస్తా. ఆ అన్నట్లు నీ కోసం రంపంగి పువ్వులు తెచ్చా. ఇవిగో తీసుకో" అంటూ అతడు ఆమె చేతిలో పెట్టడం, ఆమె అతని అరచేతిలో తీసుకొని తలలో పెట్టుకోవడం కళ్లతో చూచేసరికి ముకుందరావు బుర్ర గిర్రున తిరిగిపోయింది. తన ఆనందాన్నంతా ఆ యువకుడు దోచుకుపోయేబందిపోటు దొంగలా కన్పించాడు - అతని ఎదుట తన భార్య అప్సరసలా వుంది.

శ్యామల నవ్వుతూ ముకుందరావుతో "కూర్చోండి" అంది — కాని ముకుందరావుమాత్రం ఆయువకునివైపు తన భార్యవైపు తీవ్రంగా చూస్తున్నాడు. ఇంత ఘాటుగా చూస్తున్న భర్తని శిక్షచెయ్యనట్లుగా వారిద్దరూ ఒకరివైపు ఒకరుకొంటె చూపులుచూసుకొంటూ చిలిపి నవ్వులు నవ్వుకొంటూంటే ముకుందరావు మనసులో ఆకాశం ఎత్తునా అసూయాజ్వాలలు లేచాయి.

"ఏయ్! ఒకపరాయి వ్యక్తితో ఇల్లావ్యవహరించడం సంసారికి లక్షణమేనా?" అని గర్జించాడు—

"ఎల్లా ప్రవర్తిస్తే మాత్రం మీకెందుకు పనికొస్తానండీ!" అంది నవ్వుతూనే శ్యామల -

ఆయువకుడు ముసిముసి నవ్వులతో ముకుందరావు వైపు చూచాడు

ముకుందరావు ఆవేశానికి తట్టుకోలేకపోయాడు. ఉద్రేకంతో ముందుకువచ్చి "కులటా! ఇన్నాళ్లూ నువ్వు ఆడే నాటకం ఇదా? ఇప్పుడేనిన్ను నీ కొడుకుదగ్గరకే పంపిస్తానుండు" అంటూ క్షణంలో మూలనున్న కర్రను తెచ్చి భార్యను కొట్టబోయేసరికి ఆమెకు అడ్డంనిల్చున్న ఆయువకునితలమీద తగిలిందా దెబ్బ —

"అయ్యో! అనసూయా!" అంటూ! గభీమని పట్టుకుంది శ్యామల. తలపాగామీద తగిలిన బలమైన దెబ్బ కావడంచేత నుదురుమీంచి బొటబొటా రక్తంకారుతూంటే చీరకొంగుతో ఒత్తిపట్టుకొంది. అంతలో శ్రీధరం, రామయ్యగారువచ్చారు. ముకుందరావు అల్లాగే శిలాప్రతిమలా నిల్చుండిపోయాడు. కూతురు తలమీంచి కారే రక్తాన్ని చూచిన రామయ్యగారు కోపంతో కళ్లల్లోంచి నిప్పులుకురిపిస్తూ "దౌర్భాగ్యుడా! కట్టుకొన్న ఇల్లాలిని ఆదరించడంచేతకాక, కడుపునపుట్టిన బిడ్డ అంతర్దశలో నీపాదాలదగ్గరకువచ్చిన ఇల్లాలిని వేశ్యలు అవమానిస్తుంటే వాళ్లకి తాళంవేసిననువ్వో ఓ మగవాడివేనా? సీతాదేవివంటి ఉత్తమసాధ్వి కాబట్టే ఇన్నాళ్లూ ఓర్పుతోసహించింది; ఆమెలోని ఆధిక్యతని నీకు చూపించడానికే నాబిడ్డకి మగవేషం వేయించాము. ఒక పరపురుషుడు ప్రక్కనవుంటే గాని నీ భార్యలోని స్త్రీత్వాన్ని గుర్తించుకోలేకపోయావు. క్షణకాలం నీభార్యతో ఓ మగవ్యక్తి మాట్లాడితేనే సహించలేనంత అసూయ నీలో వున్నప్పుడు అహోరాత్రాదులు నువ్వు పరస్త్రీలోలుడవైవుంటే నీ భార్యఎంతగా దుఃఖిస్తూందో ఇప్పటికైనా అర్థమైందా?" అని తీవ్రంగా అడిగాడు —

"ముకుందరావుగారూ! డబ్బువున్నంతకాలమే నీకు ఆనందాన్నిచ్చి, అదిలేకపోతే కుక్కకన్నకనా కష్టంగా గెంటినవేశ్యలోని ప్రియురాలి ప్రేమలో చిక్కుకుని పితృప్రేమనుకూడా విస్మరించావు. నీ భార్య ఎవరో నే నెన్నడూ తెల్సుకోలేకపోయినా ఆమెలోని మాతృప్రేమ, నేనూ ఆమెవంటి తల్లికే జన్మించినవాడనుకాబట్టి నాతల్లికి నా మీద ఎంత ప్రేమవుంటుందో ఈ పేదరాలికి అంత

ప్రేమవుంటుందని తక్షణం ఆవిడతో అర్ధరాత్రి సమయమని శంకించక వచ్చాను — నీ భార్య నాకు సోదరి వంటిది. సాటిమానవులి, మానవులుగా చూడ్డమే నాకు తెలుసు. ఆమె కష్టాలు గట్టెక్కించి నీ కళ్ళు తెరిపించడానికే ఆనాడు నీ జేబులో పర్సులాక్కున్నా, ఇదుగో నీ పర్సు నీడబ్బు — ఇన్నాళ్లూ నీ భార్యని సోదరిగా ఆదరించాను — నేను బిడ్డగా చూచుకున్నాడు రామయ్య - ఈ నాటినుండైనా బుద్ధిగా ప్రవర్తించు. అటువంటి మహోత్తమ సాధ్వికి భర్త అని చెప్పుకో దానికికూడా తగనని ఈనాటికైనా గుర్తించుకో —" అన్నాడు రౌద్రాకారంతో శ్రీధరం -

"సాటి స్త్రీకోసం నారక్తాన్ని ధారపోసినా ఆమె ఆనందంగా సుఖించగలిగితే చాలు - ఇంకనుంచైనా మా అక్కయ్యను సేవించి జన్మతరింపచేసుకోండి ముకుందరావుగారూ ?" అంది అనసూయ —

అందరి మాటలు వినేసరికి ఒక్కసారిగా తన కళ్ళల్లోని చీకటి తెర తొలగిపోయింది. "శ్యామలా! నువ్వు దేవతవి. నీలోని పవిత్రతను అర్థంచేసుకోలేక పోయిన కిరాతకుణ్ణి. నన్ను క్షమించవూ ?" అని పశ్చాత్తాపంతో భార్య రెండు చేతులుపట్టుకున్నాడు ముకుందరావు -

అందరి కళ్ళల్లోనూ ఆనందకాంతి వెల్లిపోతోంది. శ్రీధరం అనసూయ తలకు కట్టుకట్టి "అబ్బా! ఎంత దెబ్బతగిలింది!" అని నొచ్చుకొన్నాడు — అతనిహస్త స్పర్శకి సిగ్గుతో తలవంచుకొని శ్యామల దగ్గరగా నిల్చుంది -

"రామయ్య మామగారూ! నన్ను క్షమించండి. శ్రీధరంగారూ! మీరు నా యజమాని కొడుకైవుండీ మాయందు చూపిన ఆదరాభిమానానికి కృతజ్ఞుణ్ణి" అని అనసూయవైపు చూచి బిడియంతో "నా తప్పిదానికి మన్నించండి" అన్నాడు —

"ఫరవాలేదు నాయనా! బ్రతుకులో చీకటి వెలుగులు. కొన్నాళ్లు చీకటి - తర్వాత వెలుగు - మీకు చీకటిరాత్రులు గడిచాయి. ఇంకనుంచి చల్లగా సంసారం చేసుకోండి. "ఇవ్వాళనుంచే శ్రీధరంగారి కోటలో మామూలుగా ప్రవేశించండి" అన్నాడు రామయ్య ఆనందంతో - "నాదొక్క కోరిక శ్రీధరంగారూ! మీరు కాదనక నెరవేర్చాలి" అంది శ్యామల-

"మా అన్నయ్యగారెక్కడికీ వెళ్లకుండా కాపలా కాయమంటారా ?" నవ్వుతూ అడిగాడు —

"కాదు — మా చెల్లి అనసూయని కాపలా కాయండి. అన్ని విధాలా మా శ్రేయస్సుకోరే మీరు అనసూయను భార్యగా స్వీకరించి రామయ్యబాబు గారి భారాన్ని తీర్చమని నా వేడికోలు -"

ఆ మాటకోసమే ఎదురుచూస్తూన్న అనసూయ శ్రీధరం; సిగ్గుతో తలవంచుకున్నారు —

శ్యామలా ముకుందరావు, అనసూయ శ్రీధరం కలిసి రామయ్యగారికి నమస్కరిస్తోంటే శతసహస్రదీవనలిస్తూ ఆనందంతో ఉప్పొంగిపోయాడు ఆతండ్రి-

జై హింద్

పాత్రుడు గారి
బాలసంజీవిని (Regd)
పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును
డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్
19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 71354
కుంభకోణము బ్రాంచి: 7. సారంగపాణి కోవిల తూర్పువీధి.
అన్ని మందుల షాపులలోను దొరకును.

# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సిరిపి ఆంజనేయులు

(గత సంచిక తరువాయి)

పురనాయకులు సల్పు పూజ్యధర్మమున
మసలెడు పాపకర్మంబు సైరింప
నోపక వనలక్ష్మి యుఱిమిచూచెడినో
యను తెఱంగునఁ బశ్చిమాకాశవీథి
నంతటఁ గెంజాయ లలమె సాంద్రముగ.

సతి బలిదానమ్ము జరపెడివారి
నల్కవెన్నంటి చెండాడఁదలంచి
గంగపూనిన పెనుగైదు వనంగఁ
బ్రాగ్దిశఁ గొరడు చూపట్టెఁ జిత్రముగ.
పుణ్యాంగన యొకర్త భూగర్భ మందు
నెట్టులు నడఁగు, నేనికఁ జూడఁజాల
నంచుఁ జాలెడినో లోకాళికి ననఁగఁ
బూషుండు పశ్చిమాంబుధిఁ గ్రుంకె-నంత
నత్తమామల యాజ్ఞ నంది, రత్నాల
రాశిఁ బొందిన యట్లు రమణి యుప్పొంగి,
యాత్మేశు నానతి ననువునఁ బడసి,
తలదిగబార నర్మిలిఁ దానమాడి,
ధవళాంబరముల నాదటవోవఁ దాల్చి,
మెయినిండఁ దొడవులు మెలపునఁ దొడిగి,
పసపుఁ గపోలంపుఁబార్శ్వభాగముల
హస్తపాదమ్ముల నలఁది, నెన్నుదుటఁ
గుంకుమతిలకంబు గూరిచి, కురుల
కీల్మడివైచి, మిక్కిలివిరుల్ దుఱిమి,
కనులఁ గాటుకపెట్టి, కరకమలముల
నిమ్మపండ్లిమ్ముగ, నిల్పి, సద్భక్తి
భర్తపాదములకుఁ బ్రణతు లర్పించి,
నత్తకు మామకు నవలఁ జేమోడ్చి,
బావలకును మ్రొక్కి, బంధుల కెరఁగి,
తోడికోడండ్ర ముద్దులుగొని, చెలుల
వీడ్కొని, సంభ్రమాన్వితచిత్త యగుచుఁ
గదలెఁ దటాకమార్గమున నా గఱిత
జనము లగాధవిషాదపయోధిఁ
దోఁగుచు వీఁగుచుఁ దోడ్తోడ నడువ.
వడివడి ముసలమ్మ వరిపొలములను
గాల్వలఁ గట్లను గడచుచు నరిగి,
విశ్వేశునకు♦ భక్తివినతు లర్పించి,
రక్తిఁ బుష్కరిణిఁ దీర్థమ్ము సేవించి,
గణనాథునకు నమస్కారముల్ చేసి,
చౌడేశ్వరికిని గైమోడుపుల్గూర్చి,
విహగకూజితములు విలసిల్లుచుండు
నింబవృక్షశ్రేణినిం బసగుల్కు
తటము దాఁపున కేఁగి, తన్మధ్యమందు
గండికపడిన భాగముఁ జేరఁబోయి,
యటనాఁగి, పౌరుల నందఱ నరసి -

"ఓధర్మనిధులార! యోతండ్రులార!
యోదయాన్వితులార! యోతల్లులార!
మీప్రాపుకతమున మీ కందువోలె
నెల్లర నెనరున నేఁ బేర్మిఁ గంటి;
నిప్డు మీ యాజ్ఞ నర్థించెడిదాన;
మిమ్ముఁ బాయుదు నంచు మీ రెన్నవలదు;

♦. 'శ్రీకాశీ విశ్వేశ్వరుఁ'డని శిలాఫలకము లుత్తు నుడువుచున్నవి. జనవాక్కుసైత మట్టిదే. ఈ కాశీవిశ్వేశ్వరాలయము 'ముసలమ్మకట్ట' కుఁ దూర్పున కొన్ని గజముల యెడమున నేకలదు. శ్రీ వీరబుక్కరాయల యమాత్యపుంగవుఁడగు శ్రీ చిక్కనమంత్రిచే క్రీ. శ. 1343 – 1379 ప్రాంతమున నొనర్పఁబడిన చంపపు శిలలలో, ఈ యాలయ నిర్మాణము చేరును.

చెడునది దేహంబె జీవంబు కాదు ;
ఈ బొంది లేకున్న నేమిలోపంబు ?
మీ చెఱువుం బెంపు మీ యూరినింపు
మీ పాఁడిపసులను మీ పొలములను
మీ యింపుసొంపుల మేల్మిఁ గన్గొంచు
మీ మనఃప్రీతి నెమ్మిని నుండుఁడావఁ ;
గాన నాదృతిని నా కానతియిండు ;
నే నీబిలంబున నిల్చుటతోన
దరిఁ బెనుజాల భద్రముసేయు నెడలఁ
బ్రజల కందఱకు భద్రమ్ము చేకూరు ;
నిదె నా ప్రణామమ్ము వెల్లర కిడుదు"
నని సవినయముగా వినతు లొనర్చి,
యా బాల గంగహృదంతర సీమ
నిల్చి కేల్మోగిచి మానితభక్తి నిగుడ –

"నిఖిలజీవములకు నిండుజీవంబ
వైన చల్లనితల్లి ! నానమశ్శతము :
ఏ హానిలేక మేమింత కాలంబు
నీ దయామృతవృష్టి నెగడుచుండితిమి ;
అమ్మ ! నీయానతి నొదలఁదాల్చి
చేరవచ్చితి ననుఁ జేకొనుమమ్మ
అనవరతమ్ము సమాదరగరిమ
నందఱ నెనసి కాపాడు మో దేవి !
యని మదిఁ బ్రార్థించి యామంగళాంగి
నేత్రాబ్జయుగళి వెన్నెలలు చెల్వలర,
గండభాగమ్ముల కాంతు లుప్పొంగఁ
గెమ్మోవిరంగు మిక్కిలి మిన్కు సంగఁ
దుపఁగాంచి ప్రజ నొక్క త్రుటి కాలమంద
నెఱియఁ బ్రవేశించి నిల్చె గర్భమున. 2

అంతట సరగున నందఱు జనులు
పెక్కు జాలను మంటి బెడ్డలం జేర్చి
నించిరిబిలము సమంచితరీతి
నొడ్డు పదిలమయ్యె ; నొనగూడె శుభము ;
బుక్కరాయ సముద్రం పురభాగమందు
నావులు చెలఁగి నిరంతరధార
లే ప్రొద్దుఁ గురిసె పాలేఱులు గాఁగఁ ;
బంట లినుమడించెఁ బ్రజ యేఁపుగాంచె ;
నెలకొనె నింటింట నిత్యోత్సవంబుఁ
బచ్చ తోరణము ; సంపద లొప్పుమీఱె.

ముసలమ్మ యిట్లు సమ్మోదాత్మయగుచు
కర్మయోగమునఁ జొక్కపుఁ దేట యనఁగ
రాజయోగమున నిర్మలసార మనఁగ
జ్ఞానయోగమునఁ బ్రజ్ఞాసత్వ మనఁగఁ
భక్తియోగమున నప్రపుఁజేవ యనఁగఁ
దనరు నహింసాపథంబు పాటించి,
పరహితాచరణ విభావంబు నెఱపి,
యవ్యాజమతి నిహయాత్ర సాగించి,
దివ్యయోగులకు నతీతమౌ సరణి
శాంతవృత్తిని ననాసక్తి యోగమున

నార్తజనులఁ గావ నాత్మార్పణంబుఁ
బొనరించె ;
అట్టి సంపూజ్య చరిత్ర
మా చంద్ర తారార్కమై విలసిల్ల
మంజరీద్విపద సంపద మేల్మి యొప్పఁ
దేట తెనుంగునఁ దేవిక నుడులఁ
గూరిచె సిరిపికులవర్ణనుండు
ప్రథితసాహిత్య సరస్వతీ బిరుద
విభ్రాజితుఁడు యోగవిజ్ఞానకలితుఁ
డాంజనేయుండు విద్యావిధేయుండు.

సమాప్తము

(అన్ని హక్కులు రచయితవి)

---

2. తటాకగర్భమున నిల్చినాఁటికి ముసలమ్మ యీడేగని బాలయనికింవదంతి. అప్పటికామె పెనిమిటితోఁ గాపురము చేయుచు, నింకను [illegible] ప్రారంభదశయందుగ నిసవయ్యెను అని శ్రుతి.




# కలసివచ్చిన అదృష్టం

కుమారి చివుకుల కనకమ్మ

ఆ గ్రామంలో-నరసయ్య చిన్నపూరి గుడిశలో తల్లి దండ్రులతో నుంటుండేవాడు. వారు చాల బీద వారు. కూలి, నాలిచేసి జీవనంచేస్తుండేవారు. నరసయ్య తల్లిదండ్రుల ఆదాయం స్వల్పమగుటచే అతడు చినిగినగతంలను ధరించి ఒక్కొక్కపూట భోజనమునకుకూడ గడువకయుండేది. అయినా అతనిలో ఎల్లప్పుడు ఓర్పు, తృప్తిగుంటూ యుండేవి.

అది చలికాలమగుటచే ఆకలికి వణకలాడిపోతూ ఒకనాడు అరుగుమీద కూర్చొనియున్నాడు. రాత్రి తొమ్మిది గంటలకు ఎంతో ప్రయాసపడి తండ్రి ఒక రొట్టె తెచ్చి, మూడు భాగాలుగా చేశాడు. అందులో రెండుభాగాలు భార్యకు, నరసయ్యకు యిచ్చి, మిగిలినభాగాన్ని తాను తీసికున్నాడు. ముగ్గురూ కూర్చొని తినమెదలు పెట్టారు. ఇంతలో ఎదుటనున్న దీపందగ్గర ఒక దేవదూత ప్రత్యక్షమయి నరసయ్య తండ్రిచేతిలోని రొట్టెముక్కను లాగేసి తినసాగింది. ఆయన గగ్గోలు పెడుతూ "ఇదేమిటీ అన్యాయం! నేను ఆకలయి చచ్చిపోతుంటే నా రొట్టెముక్కను తీసికుంటావు _ నీ వెవరు?" అని వలవలలాడాడు. ఆ దేవదూత అతనిని ఓదారుస్తూ "నాకీ రొట్టెముక్క కావాలి. నీకింత కంటె మేలైన బహుమానం యిస్తాను. దాంతో నీవు, నీకుటుంబము సుఖంగా జీవించవచ్చును" అన్నది.

నరసయ్య, తల్లి, దండ్రి నివ్వెరపోయి చూస్తూ నిలబడ్డారు. ఆదేవదూత "నీకు బంగారు గ్రుడ్లను పెట్టే బాతు నొకదానినిస్తాను. అది ప్రతిరోజు పెట్టే గ్రుడ్లను అమ్ముకొని సుఖంగా మీరు జీవనంచేయ వచ్చును" అన్నది.

"ఏదీ ఆ బాతు?" అని అడిగింది నరసయ్య తల్లి ఆదుర్దాతో.

"ఆగు! ఆగు! అంత అవసరపడితే ఎట్లాగూ! రేపు ఉదయం నీవు పట్టణానికి పోయేటప్పుడు మార్గ మధ్యంలోనున్న చెరువులో ఆ బాతుయుంటుంది. దానిని మెల్లగా పట్టి తెచ్చుకో! అది ప్రతిదినము ఉదయం ఒకబంగారు గ్రుడ్డు పెడుతుంది" అని నరసయ్య తండ్రితో చెప్పి దేవదూత మాయమై పోయింది.

మరునాడు ఉదయం నరసయ్యతండ్రి సమీపమున గల పట్టణానికి బయలుదేరి వెళుతుంటే దేవదూత చెప్పినట్లే చెరువులో ఒక్కే ఒక బాతుయుండింది. దానిని అతడు మెల్లగా పట్టి యింటికి తెచ్చాడు. మరునాడుదయం బాతును కప్పియుంచిన తట్టఎత్తి చూడురుకదా-నిజంగా బంగారు గ్రుడ్డు యుండింది. ఇంటిల్లిపాది ఆనందపరవశులయ్యారు. అప్పటినుండి నరసయ్య తండ్రి ప్రతిరోజు సమీపానగల పట్నం మార్కెట్టుకు వెళ్లి బంగారు గుడ్డును అమ్మి కావల్సిన వస్తువులను గుడ్డలను కొని తెస్తుంటే చీకు చింత మాయమై పోయాయి. కొంత కాలానికి నరసయ్య తండ్రి ధనకనకవస్తువాహనాలతో తులతూగ సాగాడు ఉండడానికి మేడలూ, మిద్దెలూ ఏర్పడినవి. ఇలాచాలకాలం ఆ కుటుంబం సుఖసౌభాగ్యములతో గడిపింది.

నరసయ్య యింట్లో ఒక సేవకుడు యీ సంపద అంత ఎలా ఏర్పడిందో తెలిసికోవాలని ఆచూకి తీయసాగాడు. ఒకరోజు అందరికంటె ముందర నిద్ర లేచి బాతును కప్పేసిన గంపను ఎత్తి చూచి బంగారు గ్రుడ్డను చూచి భ్రమచెందాడు. బాతుకు సమీపంగా "ఈ బాతును ఎవరుచంపితింటారో వాడు చక్రవర్తి కాగలడు" అనే స్వర్ణాక్షరాలు సయితం కనుపించాయి. సేవకుడదిచూచి తత్తరపోయాడు. తనయజమానికి చదువురాదు కాబట్టి అతనికా అక్షరాలను గురించే తెలిసియుండదనుకున్నాడు. ఇంతలో నరసయ్య తల్లివచ్చి అది చూచి బంగారు గ్రుడ్డు రహస్యం బయటపడినందుకు భయపడుతూ "ఇంత వరకు యీ రహస్యం నరమానవునికి తెలియదు. నీవీనాడు చూచిన సంగతి మరెవ్వరికి చెప్పవద్దు; నీకు ఎంత ధనంకావలిస్తే అంత యిస్తాను" అని సేవకునితో అన్నది.

"ఎంత పిచ్చి తల్లీ నీది! రహస్యం బయటపడనంత కాలమే యీబాతు బ్రతికేదైనా, బంగారు గ్రుడ్డుపెట్టేదైనా. ఇకమీకీ బాతు దక్కదు" అని దానినెలాగైనా లంకించుకొని చంపితింటే తాను చక్రవర్తికాగలను గదాయని యూహిస్తూ వెళ్ళిపోయాడు.

రహస్యం బయటపడిన సంగతి, బాతువల్ల ఏర్పడగల ప్రమాదంతెలిసి భర్త కోపపడతాడని వెంటనే బాతునుచంపి, మధ్యాహ్నంభోజనానికి బాణలిలో వేయించియుంచింది. కొంతసేపటికి నరసయ్య ఆకలితో ఎక్కడినుండో తిరిగి తిరిగి వచ్చి తల్లి కనుపించకపోయేసరికి వంటయింట్లో వేయించియుంచి గుమగుమలాడుతున్న బాతును మొత్తం తిని ఎముకలను మాత్రం కంచంలో వదలేసి వెళ్ళిపోయాడు. సేవకుడు సయితం యింట్లో ఎవరూలేకపోవడంచూచి బాతును దొంగిలించుకపోయి చంపి తిందామని యిల్లంతా వెదకిచూచి ఎక్కడా బాతు కనుపించకపోయే సరికి నిస్పృహచెందాడు. నరసయ్య తండ్రివచ్చి బాతు కనిపించకపోయేసరికి ఏదని యింట్లో ఎవరినడిగినా జవాబు చెప్పారుకారు. నరసయ్య యింటికి తిరిగి రాగానే" బాతు కనుపించదంలేదు; ఏమయింది ?"అని గద్దించి అడిగాడు తండ్రి.

"నరసయ్య ఏమో-నాకు మాత్రం ఏమితెలుసు! మధ్యాహ్నం మాత్రం అమ్మ భోజనానికి బాతును వేయించియుంచింది. నాకు ఎక్కువ ఆకలిగానుండి మొత్తం నేనేతినేశాను"అన్నాడు. తండ్రి ఆ మాటలువిని మండి పడ్తూ నరసయ్యను యిల్లువెడలగొట్టాడు. భార్యను చావమోదాడు. ఆ నాటినుండి మేడలు, మిద్దెల, ధనకనక వస్తు వాహనాలు మాయమై ఎప్పటి పూరిగుడిసె, పేదరికం మరల ప్రాప్తించినవి.

నరసయ్య పుట్టెడు దుఃఖముతో దరి, డొంక లేకుండా రాత్రింబగళ్లు ప్రయాణం చేస్తుండగా ఒక అడవిలో ఒక ముసలమ్మ ఎదురయి "ఏం నాయనా! యీ భయంకరమైన అడవిలో ప్రయాణంచేస్తున్నావే ఎంత ప్రమాదమో తెలుసా!" అన్నది. నరసయ్య వలవల ఏడుస్తూ జరిగినకథంతా చెప్పాడు ఆమెతో

ఆ ముసలమ్మ ఓదారుస్తూ "ఏడవకు నాయనా! ఏడవకు! నీకు మంచిరోజులు వచ్చినవి, ఇదే దారిన వెళ్లు – నీవు ఒక పట్టణానికి సమీపంగా వెళ్లేసరికి ఏం జరుగుతుందో నీవే చూద్దుగాని" అని తనదారిన తాను వెళ్లిపోయింది. నరసయ్య ఆ దారినే వెళ్లి పట్టణపరిసరాలకు వెళ్లేసరికి అతని రాకకై ఎదురు చూస్తున్నట్లు ప్రజలు ఆనందోత్సాహాలతో స్వాగతమిచ్చి "మనప్రభువు వచ్చారు! ప్రభువు కలకాలము వర్ధిల్లాలి!" అని నినాదాలుచేస్తూ అతనిని నగరంలోకి తీసికొనివెళ్లారు. రాజభవనమును సమీపించగానే మంత్రులు, సామంతులు రాజలాంఛనాలు, మర్యాదలతో అభివందనాలుచేస్తూ "ఈ దేశం రాజు కొద్ది కాలంక్రిందటే వారసులు లేకుండా చనిపోయారు. తర్వాత మొట్టమొదట యీ నగరానికి రాగల యువకుడు మాకు రాజు కాగలడని దేవవాక్యం కాబట్టి. రాజ్యాధిపత్యం స్వీకరించి పాలించాలి, మీరేమాకు ప్రభువులు" అని పట్టాభిషేకానికి ఏర్పాటులు చేయసాగారు.

నరసయ్య రాజోచితవస్తులతో, బంగారు కిరీటంతో, లాంఛనాలతో రత్నఖచిత సింహాసనాన్ని ఎక్కి చక్రవర్తియయ్యాడు. ప్రజాను రంజకంగా కొంత కాలం పరిపాలన సాగించిన తర్వాత తల్లి

దండ్రులు జ్ఞాపకానికొచ్చి వాళ్ళనుతోడి తెమ్మని భటులను పంపాడు. వాళ్లు వచ్చి సింహాసనంమీద రాజైయున్న కుమారునిగాంచి ఆనందభాష్పాలు రాల్చారు. నరసయ్యసాదరముగా తల్లిదండ్రులను రావించి సకల సౌకర్యములతో తనతోనే రాజనగరులో నుంచుకొని పోషింపసాగాడు.

—(౦)—

# కోరి తెచ్చుకున్న అవమానం

శ్రీ జంధ్యాల పార్థసారథి

ఒక రోజున రాజయ్యగారి తోటకు ప్రక్కనేయున్న పచ్చికబయలులో ఒక అందమైన గుర్రము మేయుచుండినది. దాన్నిచూచి రాజయ్య కుమారుడు ముచ్చటపడి తమబండికి ఆ గుర్రమైతే బాగుండుకదా యనుకున్నాడు. సాయంకాలమయి సూర్యాస్తమానం కాబోతున్నా ఆ గుర్రము అక్కడినుండి కదలి వెళ్ళలేదు. తన గుర్రాన్ని వెతుక్కుంటూ వచ్చి తోలుకొనిపోయిన వారు ఎవరు లేరు. అలా మూడురోజులు పచ్చికబయలులోనే మేస్తూ గుర్రం ఉండిపోయింది.

తోటలో రాజయ్య కూరగాయలు, పండ్లు పండించి ప్రతిరోజు తమగుర్రపు బండిమీద వాటిని మార్కెటుకు తీసికొని వెళ్ళి అమ్ముకొని తిరిగివచ్చేవాడు. పచ్చికబయలులో మేస్తున్న గుర్రాన్ని తమదని ఎవరూ వచ్చితోలుకొని పోకపోయేసరికి తనకున్న మోజుకొద్దీ తమబండికి దానిని ఎందుకు కట్టి వాడుకోకూడదాయని యూహించి "నాన్నా! యీ గుర్రంచాల బాగుంది. మూడురోజులనుండి యిక్కడే యుండిమేస్తున్నది. అది ఎవరిదో మరి! ఎవరూ వచ్చితోలుకొని వెళ్ళలేదు, దానిని మనబండికి కట్టివాడుకుంటే మాత్రం ఎవరడుగువారు?" అన్నాడు.

"వద్దుబాబూ! వద్దు ఎవరైనా తమ గుర్రాన్ని గుర్తించితే మనం అవమానం పాలగుతాము. మనగుర్రం మనకున్నదిగా!" అన్నాడు రాజయ్య.

"ఇంతవరకు తమగుర్రమని రానివాళ్లు యిప్పుడురావచ్చారా! ఏదో దూరదేశం నుండి తప్పించుకొని పారివచ్చియుంటుంది. బంగారంవంటి గుర్రం మనకు దక్కుతుంటే చేయిజారడం తెలివి తక్కువగుతుంది నాన్న! ఏమయినాసరే యీరోజున యీ గుర్రాన్ని మనబండికి కట్టి మార్కెట్టుకు తీసికొని వెళ్తాను" అన్నాడు మంకుతనంగా

రాజయ్య తటపటాయిస్తూ ఏమనకుండా యూరుకున్నాడు, రాజయ్య కొడుకు బండినిండా కాయగూరలను, నారింజపండ్లను, నింపుకొని క్రొత్త గుర్రాన్నికట్టి మార్కెట్టుకు ఠీవిగా బయలుదేరాడు. మార్గ మధ్యంలో స్నేహితులు కనుపించి "ఏం రంగన్నబాబూ! ఎప్పుడో క్రొత్తగుర్రాన్నికొన్నట్లున్నదే! చాలబాగున్నది" అన్నారు.

రాజయ్యకొడుకు "అవును క్రిందటి ఆదివారంనాడు ద్వారపూడి సంతలో కొన్నాను" అని జంకూగొంకూ లేనట్లు ముందుకు బండిని నడిపించసాగాడు. తీరా మార్కెట్టుదగ్గరకు చేరగానే అక్కడ ఒక ప్రక్కన ఒక బీదబాలురబృందము వచ్చేపోయేవారిని ఆకర్షించి తమ చదువు,భోజన వసతులకుగాను ఆడుకోడానికి బ్యాండుమేళం వాయించడం మొదలు పెట్టారు. ఆ బ్యాండుమేళం విని దానికనుగుణంగాగుర్రం అడుగులు వేయసాగింది. బ్యాండుమేళం హెచ్చు స్థాయిలో వాయించసాగేసరికి గుర్రం మరింత రెచ్చిపోయి చిందులు త్రొక్కుతూ తనకుకట్టియున్న బండిని సమేతంగు త్రించకుండా మార్కెటుచుట్టూ తిరుగసాగింది. దాన్ని స్వాధీనంలో నుంచుకోవాలని ఎంతప్రయత్నించినా అది ఆగలేదు. బండిలో మూటలు ఒకటొకటిగా పడిపోసాగినవి. బండేబోల్తాకొడ్తుందేమోనని భయపడి రాజయ్యకొడుకు బండిమీద నుండిక్రిందకిదూకాడు, బ్యాండు వాయించినంతసేపూ గుర్రం అలా ఆడుతూనే యుండింది. అక్కడ గుంపులు గుంపులుగా చేరి చోద్యపడుతున్నవారు "ఇది ఆటగుర్రమయియుండాలి!"అనుకోసాగారు. ఇంతలో యిద్దరు పోలీసులు వచ్చి "ఏయ్ ఏమిటీ రభస-నలుగురూవచ్చేపోయే-చోటుయిది. యీ గుర్రం ఆడడమేమిటి! ముందు బండిని బయటికి నడిపించు" అని గదామాయించారు. పాపం రాజయ్య కొడుకు ఏమిచేయడానికి అశక్తుడై గ్రుడ్లుతేలవేశాడు. బ్యాండుమేళం ఆగిపోయింది; ఇంతలో పోలీస్ యిన్స్పెక్టర్ అక్కడికి వచ్చి "ఏక్! నిజం చెప్పు యీ గుర్రం నిజంగా నీదేనా?" అని గద్దించి అడిగాడు.

రాజయ్య కొడుకు మాటలు తడబడుతూ "నాదేనండీ—ద్వారపూడి సంతలో కొన్నాను" అన్నాడు.

"జేబులోనుండి డైరీ తీసి" ఇదిగో చూడు సర్కసు కంపెనీవారి తెల్లగుర్రం తప్పించుక పారిపోయిందని రిపోర్టిచ్చారు. వాళ్లు సూచించిన పోలికలను బట్టి యిది వారి గుర్రమై యుండాలి - ఏమంటావ్?" అన్నాడు ఇన్స్పెక్టర్ గ్రుడ్లురజేస్తూ.

రాజయ్య కొడుకు గజగజలాడుతూ "క్షమించండి బాబూ! నేను దీనిని కొనలేదు. పచ్చికబయలులో మేస్తూయుండి నాకు దొరికింది" అన్నాడు మెల్లగా.

"ఎవరి గుర్రాన్నో పట్టుకొని నీదిగా ఉపయోగించుకుంటావా! పద సర్కస్ కంపెనీవారి దగ్గరకు గుర్రంతో సహా" అన్నాడు ఇన్స్పెక్టర్.

అక్కడున్న వాళ్లంతా రాజయ్య కొడుకు దొంగ అని హేళనచేయసాగారు. ఇన్స్పెక్టర్ వెంట రాజయ్య కొడుకు గుర్రాన్ని తోలుకొని సర్కస్ కంపెనీవారి దగ్గరకుపోక తప్పిందికాదు. ఇక ముందిటువంటి మోసం పనులుచేసి అబద్ధాలాడవద్దని ఇన్స్పెక్టరు మందలించగా, యిరవై రూపాయలు గుర్రంతోసహా యిచ్చి క్షమాపణ కోరిన తర్వాత రాజయ్య కొడుకును వదలిపెట్టారు సర్కస్ కంపెనీవారు. ఈ

విషయం తెలిసినవారు అతనిని హేళన చేసి హీనంగా చూస్తుంటే చాలకాలం రాజయ్య దంపతులకు, కొడుకుకు కూడా తలవంపులుగా నుండేది. కాబట్టి పరుల సొత్తుకు అక్రమంగా ఆశపడరాదని మీరు తెలిసికుంటారు కదూ బాలలూ!



ఒక అల్లుడు అత్తగారింటికి వెళ్లాడు. భోంచేసి నంతసేపూ ముందుకూ వెనక్కూ చూడసాగాడు. వడ్డిస్తున్న అత్తగారది చూచి "ఏం నాయనా! ఏం కావాలి? ఎందుకలా చూస్తున్నావు" అని అడిగింది.

"ఏంలేదు అత్తయ్యగారూ! మా అమ్మ తరచుగా 'విస్తరిముందు కూర్చొని తినడం కాదురా — ముందు వెనుకలు కొంచెము గమనిస్తూ తింటుండాలి' అంటుంటుంది. అందుకని..." అన్నాడు అల్లుడు.

♦ ♦ ♦

ఒక ముసలాయన మనుమడికి లెక్కలు చెప్తూ "ఈ ఇల్లు రూ. 950/-లు ఖరీదు. దీనిని రూ. 520/-లకు అమ్మితే..?" అన్నాడు అతని ముఖంవంక చూచి,

"అమ్మితే మనల్ని జైల్లో వేస్తారు. మనం ఉంటున్నది అద్దెయిల్లు తాతయ్యా! మనమెలా అమ్మగలుగుతాం?" అన్నాడు కుర్రాడు.

వేముల కుటుంబరావు


డాక్టరు కే. యన్. కేసరిగారి

'నా చిన్ననాటి ముచ్చట్లు'

వెల రు. 2.00 లే — పోస్టేజి ఉచితం

హిగిన్ బాదమ్స్ స్టాల్సులో దొరుకుతుంది

కేసరిగారి

శ్రీఫలాది పానకం

గర్భమునందు, నోటియందు మేహజబ్బులవల్ల, యితర కారణములవల్ల పుండగుట, చీము నెత్తురుతో మలము వెలువడుట, నీళ్ల విరేచనములను నివారించును. గ్రహిణిజబ్బులు, అతిసారము, కడుపునొప్పితో కూడిన జిగట విరేచనములను నమ్మకముగా కుదుర్చును.

వెల రు. 1.60

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

మద్రాసు — 14.

Grams: 'LODHRA' Phone: 86637

Grihalakshmi

*Illustrated Telugu Monthly*

Published on every 15th

**Advt. Rates**

| | |
|---|---|
| Ordinary page | ... Rs. 60/- |
| 2nd Wrapper single colour | ... Rs. 80/- |
| 3rd ,, ,, | ... Rs. 80/- |
| 4th ,, ,, | ... Rs. 100/- |

*Only mounted blocks are accepted.*
*Halftones not finer than 75 screens.*

Last date for receiving advt. lay-outs and blocks—15 days in advance of the date of publication.

All communications and materials may be addressed to:

THE ADVT. MANAGER,
"Grihalakshmi"
Royapettah, Madras-14.

# వింధ్యాద్రి గర్వభంగము

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ



(గత సంచిక తరువాయి)

అనగా పైనచెప్పిన కర్మలలో ఏ ఒక్కటి చేసినను, కొన్నింటిని చేసినను, అన్నింటిని చేసిననూ, చేయబడిన కర్మలనుబట్టి అనుపాతికంగా ఫలం లభిస్తుందని తాత్పర్యము. శుక్లపక్షంలో విదియనుండి పౌర్ణమి వరకు ఒక్కొక్కటి చొప్పున చంద్రుని కళలు పెరిగినట్లు కాశీవాసముచేయు జనుల పుణ్యముకూడ ప్రతిదినం పెరుగుతూ ఉంటుంది. ధర్మమనే వృక్షాన్ని అందరూ ఆశ్రయించాలి. ఆ వృక్షానికి శ్రద్ధ బీజము. ఆ వృక్షాన్ని విప్రపాదాలనే జలంతో కడగాలి. అష్టదశ విద్యలు దాని కొమ్మలు. న్యాయోపార్జితమైన ధనమే దాని పుష్పాలు. కామమోక్షములు రెండు క్రమంగా దాని స్థూల సూక్ష్మములైన ఫలాలు. అన్నపూర్ణ, ఈ క్షేత్రంలో నివసించే సర్వప్రాణుల కోర్కెలను తీరుస్తుంది. ఢుంఢిగణపతి సర్వమనోరథాలను ఈడేరుస్తాడు. ఇచ్చట మరణించు ప్రతి ప్రాణి చెవిలోను విశ్వేశ్వరుడు మంత్రోపదేశంచేసి ముక్తిని ప్రసాదిస్తాడు. కాశీలో ధర్మం నాలుగు పాదాలతో నిలచియున్నది. అర్థముకూడ అనేక ప్రకారములుగా ఉన్నది. కాశీలో కామపురుషార్థము సర్వసౌఖ్యాలకు ఆలయం. మోక్షపురుషార్థం కాశీలోనే ఉన్నది. ఇతరత్ర లేదు. కాశీలో విశ్వరూపుడు స్వస్వరూపావస్థుడై యున్నాడు. కావున కాశీనగరం వంటి నగరం మూడు లోకాలలోను లేదు, అని ఈవిధంగా ఒకరితోనొకరు చెప్పుకొంటూ అగస్త్యమహర్షి ఆశ్రమాన్ని ప్రవేశించారు. అగస్త్యమహర్షి ఆశ్రమం ఎట్లా ఉన్నదంటే హోమధూమముచే సుగంధితమై, వేదాధ్యయనముచేయు వటువులతో నిండి, లేత దర్భగడ్డిని నోటితో కొరుకుతూ, శ్యామక బియ్యంకొరకు ఋషికన్యలను అనుసరించు లేడిపిల్లలతో అలంకృతమై ఉన్నది. ఆ తపోవనమందు ఆరుటకై చెట్లకు కట్టబడిన పంచలు, కౌపీనాలు విఘ్నాలనే మృగాలను పట్టుకొనుటకు పరచబడిన జాలాలవలెను కట్టబడిన త్రాళ్లవలెను ఉన్నాయి. లోపాముద్ర అడుగుజాడలచే ముద్రితమైన పర్ణశాల ప్రవేశించి ఇంద్రాది సురులంతా అప్పుడే సమాధినుండి లేచి దర్భాసనముమీద కూర్చొనియున్న అగస్త్యమహర్షికి సాష్టాంగనమస్కారంచేసి జైజై కారం చేసారు. అగస్త్యమహర్షి వారికి స్వాగతము చెప్పి యథోచితములైన ఆసనములమీద వారిని కూర్చుండబెట్టి యథోచితంగా సత్కరించి, ఆశీర్వాదాలతో అభినందించి మీ రాకకు కారణమేమి? అని అడిగాడు. అప్పుడు సురలంతా బృహస్పతివైపు చూచారు. బృహస్పతి ఈవిధంగా చెప్పసాగాడు. "ఓ మహర్షీ! నీవు ధన్యుడవు, కృతకృత్యుడవు. మహామహులకుకూడ పూజనీయుడవు. ఈ ప్రపంచంలో ఎన్నో పర్వతాలు, ఎన్నో అరణ్యాలు, ఎన్నో ఆశ్రమాలు ఉన్నాయి. వాటిలో ఎందరో లెక్కలేని తపోధనులుకూడ నివసిస్తూ ఉన్నారు. కాని వారియందరికంటె నీలో ఒక ప్రత్యేకత ఉన్నది. బ్రహ్మతేజస్సు నీయందు స్థిరమై ఉన్నది. తపోలక్ష్మి నిన్ను వరించియున్నది. నీవు గొప్ప పుణ్యాత్ముడవు. గొప్ప ఔదార్యము గలవాడవు. నీ సహధర్మచారిణియైన లోపాముద్ర మహాపతివ్రత. పతివ్రతా శిరోమణులైన సావిత్రి, అనసూయ, అరుంధతి, శాండిల్య, సతీదేవి, లక్ష్మీదేవి, మేన, సునీతి, సూజ్ఞ, స్వాహా మున్నగు వారిలో ఈమె ఒకరిత.

ఈమె నీవు భోజనముచేసిన పిదప భోజనము చేయును. నీవు నిలచియుండిన ఈమెకూడ నిలచియుండును. నీవు నిద్రించిన తర్వాత ఆమె నిద్రించును. నీకంటె ముందుగా మేల్కొనును. అలంకరించుకొనకయే ఆమె తన స్వరూపమును నీకు చూపదు. పనిమీద ఎచ్చటికైనా వెళ్లవలసివచ్చిన అలంకరించుకోకుండా వెళ్లును. నీ ఆయుర్దాయం పెరగాలను ఉద్దేశ్యంతో నిన్ను పేరుపెట్టి ఎప్పుడూ పిలవదు. ఆమె పరపురుషుల పేరును మాటవరుసకైనను ఉచ్చరింపదు. ఏ కారణంచేనైనా నీవు ఆమెమీద కోపించినా, ఆమె నీమీద కోపం చూపదు. నీవు కొట్టినాసరే ఆమె నీమీద ప్రసన్నురాలై ఉంటుంది. నీవు పిలచిన వెంటనే ఎన్ని గృహకార్యములున్నా వాటిని విడచి నీ వద్దకు వచ్చును. నీవు చెప్పనిదే ఎవ్వరికినీ, ఏ వస్తువునూ ఇవ్వదు. నీవు చెప్పనక్కరలేకుండానే నీకు పూజా

సామగ్రిని అమర్చును. నీవిచ్చిన వస్తువును మహా ప్రసాదముని స్వీకరించును, దేవతలకు, పితృగణములకు, అతిథులకు, పరిచారికవర్గానికి, ఆవులకు, బిక్షుకులకు పెట్టకుండా తాను భోజనము చేయదు. సంయమము గలదై, కార్యదక్షురాలై, సదా సంతోషముగలదై అనవసరమైన ఖర్చును చేయదు. నీ యానతిలేకుండా ఉపాసనాదులు చేయదు. సమాజాలకు, ఉత్సవాలకు పోనేపోదు. తీర్థయాత్రలకు వెళ్లనే వెళ్లదు. నీవు సుఖముగా నిద్రిస్తూ ఉన్నప్పుడు, నీవు సుఖముగా కూర్చున్నప్పుడు, నీవు సుఖముగా రమించుచున్నప్పుడు, ఆమె ఆంతరిక కార్యములకొరకైనా నీ సుఖానికి భంగం కలిగించదు. ఇక మానసిక ధర్మంలో ఉన్న మూడు రోజులు తన ముఖాన్ని నీకు చూపనే చూపదు. స్నానంచేసి మరల శుద్ధురాలయ్యేవరకు నీతో మాట్లాడదు. స్నానముచేసిన వెంటనే నీ ముఖాన్నే చూచునుగాని యితరుల ముఖం చూడదు. ఏ కారణంచేతనైనా నీవు ఆశ్రమమందు లేనియెడల నిన్ను ధ్యానించుకొని సూర్య దర్శనం చేస్తుంది. అట్టి మహాపతివ్రత నీ యిల్లాలు, లోకములో పతివ్రతయైన స్త్రీ ఈ క్రింద చెప్పిన విధంగా నడచుకోవాలి:—

పతివ్రతయైన స్త్రీ భర్త ఆయుష్షునుకోరి పసుపు, కుంకుమ, సిందూరము, కాటుక, తాంబూలము మున్నగునవి ఉపయోగించాలి. చేతికి, తలకు, చెవికి ఆభరణాలను పెట్టుకోవాలి. సతియైన స్త్రీ చాకలి దానితోను, సత్కర్మల విషయంలో తర్కవితర్కాలుచేయు స్త్రీలతోను, కాపాలికాది మతాలను స్వీకరించిన సన్యాసులతోను భాగ్యహీనురాలతోను స్నేహం చేయకూడదు. పతివ్రతయైన స్త్రీ తన భర్తను ద్వేషించు స్త్రీలతో మాట్లాడకూడదు. ఏకాకినియై యెచ్చటకును పోకూడదు. నగ్నరాలై స్నానం చేయకూడదు. పతివ్రతయైన స్త్రీ రోటిమీద, చీపురుమీద, రుబ్బురోటిమీద (తిరగలిమీద) ద్వారముమీద కూర్చోకూడదు. భర్తకు అభిరుచిగల విషయాలలోనే తానుకూడ అభిరుచి గల్గియుండాలి. భర్తయాజ్ఞ నుల్లంఘించకూడదు. భర్త నపుంసకుడైనా, దురవస్థలో ఉన్నా, వ్యాధిగ్రస్తుడైనా, వృద్ధుడైనాసరే వానిని దాటి పతివ్రతయై స్త్రీ యితరులతో వ్యభిచరించకూడదు. పతివ్రతయైన స్త్రీ భర్త సుఖమునే తన సుఖముగాను, భర్త దుఃఖమునే తన దుఃఖముగాను ఎంచవలయును. నెయ్యి, నూని, ఉప్పు మున్నగు వంటసామానులు ఇంట్లో కొంచం తక్కువగా ఉన్నప్పటికీ లేవు లేవు అనిచెప్పి మాటిమాటికి భర్తను వేధించుకొని తినరాదు. తీర్థస్నానార్థినియైన భార్య భర్తపాదోదకం త్రాగాలి. స్త్రీకి భర్తను మించిన దైవములేదు. భర్తయే విష్ణువు, భర్తయే శివుడు. భర్తమాటల నుల్లంఘించి వ్రతాలు, ఉపవాసాలు చేయు స్త్రీ భర్త ఆయుర్దాయాన్ని అపహరిస్తూ ఉన్నదన్నమాట. అట్టి స్త్రీ నరకాన్ని పొందుతుంది. భర్త మాటాడుసరికి కోపంగా సమాధానంచెప్పే స్త్రీ గ్రామంలో కుక్క అయినా గాని, నిర్జనవనంలో నక్క అయినాగాని పుట్టుతుంది. భర్త పాదసేవయే స్త్రీల పరమధర్మము. పతివ్రతయైన స్త్రీ భర్త ఆసనముకంటె ఎత్తైన ఆసనాన్ని సేవించకూడదు. పరగృహాలకు వెళ్లకూడదు. సిగ్గును గల్గించే మాటలనెప్పుడు పలకరాదు. కలహస్వభావము గలది కాకూడదు. పెద్దలయెదుట బిగ్గరగా మాట్లాడకూడదు. పెద్దగా నవ్వకూడదు. భర్తను విడచి దుష్టబుద్ధిగలదై యితరులతో వ్యభిచరించు స్త్రీ గుడ్లగూబయై జన్మించి యెల్లప్పుడు చెట్ల తొఱ్ఱలలోనే నివాసంచేస్తూ ఉంటుంది. భర్తయే కారణంచేతనైనా కోపించి కొట్టబోవునపుడు తిరిగి భర్తను కొట్టుటకు ప్రయత్నించే భార్య అడవిలో వ్యాఘ్రిణియై (ఆడ పెద్దపులి) జన్మిస్తుంది. పరపురుషులపైన క్రీకంటి చూపులను ప్రసరింపజేయు స్త్రీ వంకరకళ్లు కలదై జన్మిస్తుంది. భర్తకు పెట్టకుండా పిండివంటలు భోజనముచేయు స్త్రీ ఆడ ఊరపందియై జన్మిస్తుంది. లేదా స్వవిష్ఠాభక్షిణియైన వల్గులిపక్షి (తలక్రిందు పక్షి)యై జన్మిస్తుంది. కష్టపడి పనిచేసివచ్చిన భర్తకు సర్వోపచారాలుచేసి పూజించు భార్య పరమసాధ్వి. ఆమెయే గొప్ప యిల్లాలు. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, పుత్రులు మున్నగువారు స్త్రీకి మితముగా ఇచ్చి కొద్దిగా సంతోషపెట్టువారే. స్త్రీకి అమితముగా పెట్టి ఆమెను పూర్తిగా సంతోషపెట్టువాడు భర్త యొక్కడే కావున యెల్లప్పుడును స్త్రీ తన భర్తనే కొల్వవలయును. స్త్రీకి భర్తయే దైవము. భర్తయే గురువు. భర్తయే పరమధర్మము. భర్తయే తీర్థములు, వ్రతములున్నూ. కావున స్త్రీ ప్రపంచంలోని అన్ని విడచియైనా భర్తను సేవించవలయును. జీవంలేని దేహంవలె భర్తలేని స్త్రీ నిత్యం స్నానం చేయుచున్నప్పటికీ అశుద్ధురాలే. విధవ ప్రపంచములోని అన్ని అమంగళములకంటె అమంగళమైనది. ఒక తల్లిని విడచి విధవలైన యితర స్త్రీలనుండి ఆశీర్వాదముగూడ శ్రేయంకాదు. స్త్రీ, భర్త ప్రీతి

యున్నా, చనిపోయినా వానికి యనుచరురాలై యుండాలి. దేహమును ఛాయవలె, చంద్రుణ్ణి వెన్నెల వలె, మేఘుణ్ణి మెరుపువలె భార్య భర్తనే అంటి పెట్టుకొని యుండాలి. భర్త చనిపోయినయెడల వానితో ఆనందంగా సహగమనం చెయ్యాలి. అట్లు చేయు స్త్రీకి అడుగడుగునా అశ్వమేధయాగం చేసి నంత ఫలం లభిస్తుంది. పాములవాడు పుట్టనుండి పాములను పైకి లాగినట్లు పతివ్రతయైన స్త్రీ తన భర్తను సమస్తపాపాలనుండి విముక్తునిచేసి స్వర్గానికి పంపుతుంది. సతియైన స్త్రీని చూచి యమదూతలు కూడ భయపడితారు. పతివ్రతయొక్క తేజస్సుచే సూర్యుడుకూడ తపిస్తాడు. వహ్నికూడ దహిస్తాడు. పతివ్రతయైన స్త్రీ తన శరీరముమీద ఎన్ని వెంట్రుక లున్నవో అన్నికోట్ల సంవత్సరాలు భర్తతోకూడి స్వర్గసుఖాన్ని అనుభవిస్తుంది. పతివ్రతచేసిన పుణ్య ఫలాలవల్ల ఆమె తండ్రివంకవారు, తల్లివంకవారు, భర్తవంకవారుకూడ స్వర్గసుఖాలను అనుభవిస్తారు.

స్త్రీలు పతివ్రతలకు కాకుండ శీలమును చెడగొట్టు కొన్నయెడల పైన వర్ణించిన కులత్రయమువారికి చెడ్డ పేరు తెచ్చిన వారవుతారు. ఇంటింటికి రూపసు లెందరో ఉన్నారు. కాని పతివ్రతయైన స్త్రీ దొరకుట కష్టం. గృహస్థధర్మానికీ, సౌఖ్యానికీ భార్యయే మూలం. ధర్మఫలం పొందుటకు భార్య కావాలి. వంశరక్షణకు, సంతానవృద్ధికి భార్య కావాలి. ఇహలోక పరలోక సుఖాలను అనుభవించటానికి భార్య కావాలి, భార్యలేనివాడు దేవపితృకార్యాలను అతిథికార్యాలను చేయుటకు అర్హుడుకాడు. అని చెప్పి, లోపాముద్ర నుద్దేశించి ఓ మహాతల్లీ, లోపాముద్రా, నీవు పరమధన్యురాలవు. నీ దర్శనమువలన సమస్తపాపాలు నశించినాయి. గంగాస్నాన ఫలం లభించింది.

(సశేషము)


ఉత్తమమైన MPF పెన్సిళ్లు

మెర్క్యురీ బ్లాక్ లెడ్
ఇంపీరియల్ కాపీయింగ్
అకౌంటెంట్ కలర్లు
(Hexagonal-Thick Size)

కోరమాండిల్ కలర్ కాపీయింగ్
చెకింగ్ కలర్లు (రౌండ్)
స్పెక్ట్రం 12 కలర్లు (విద్యార్థులకు)

MERCURY X SPECIAL HB ★ MPF No. 1100
X "IMPERIAL" X SUPERIOR Copying ★ MPF HARD

MANUFACTURED BY
THE MADRAS PENCIL FACTORY
3, STRINGER STREET, MADRAS.1.






(296 వ-పేజీ తరువాయి)

పోయాడు అబ్బాయి. అప్పటి వాడి మందహాసాన్ని ఎలా మరచిపోగలుగుతాను?...

నక్షత్రాలకేసి చూస్తుంటే అన్నీ నాకేసి చూస్తూ మందహాసంచేస్తూ వున్నట్లు కనబడటంలో వింత ఎందుకు వుంటుంది? అక్షరాలా రాజకుమార్ కళాకాంతులనే వాటిలో చూస్తూ తన్మయమైపోతున్నానని చెప్పడంలో ఆశ్చర్యం ఏమైనా వుంటుందా?...

ఇలా చెబుతూవుంటే మీలో కొందరు నన్ను పిచ్చివాడి క్రింద కట్టివేయవచ్చు. అలాకాకపోతే ఏవేవో పిచ్చిపిచ్చి కథలను, గాథలను అల్లుతూ మిమ్మల్నంతా తికమకపెడుతూ వున్నానని అనుకోవచ్చు... కాని మీరే మర్నోలోకాన్నుంచి ఇక్కడ అమాంతంగా వూడిపడ్డ ఒక రాజకుమార్‌ని కళ్లారచూసే భాగ్యం కలిగితే, అదికావాలని ఇది కావాలని వాడు చేస్తూ వుండే మారాంను ప్రత్యక్షంగా చూస్తూ వుండే అవకాశం లభిస్తే, మీ దృక్పథం పూర్తిగా మారిపోతుంది. అలాటి సమయంలో ఇలాటి తర్జనభర్జనలు చేయరని నాకు బాగా తెలుసు....

ఒక్కసారి ఆకాశంకేసి చూడండని నా ప్రార్థన! అలా చూస్తూవున్న సమయంలో మేకసంగతి జ్ఞాపకం తెచ్చుకోండి. అది అబ్బాయి పూలని తినివేసిందా? లేదా! మీలో మీరు అడగాలసిన ప్రశ్న ఇదే! దీనికి జవాబు మీరే ఇయ్యాలి...అలాటి ప్రశ్నలు మీలో రేకెత్తటానికి ప్రారంభమయ్యాయో, మీ మనోతత్త్వం పూర్తిగా మారిపోతుందన్నమాట. తరువాత సంగతి ఇక నేనెందుకు చెప్పాలి?...

ఈ లోకంలో పెద్దమనుషులు వున్నారు. వాళ్లకు అన్ని శాస్త్రాలూ కరతలామలకాలే! కాని ఆ శాస్త్రజ్ఞులకు ఈ చిన్న రహస్యం ఎలా అవగాహనమవుతుంది?....

ఒకసారి కన్నెత్తి ఆకాశమండలంకేసి చూడటానికి మొదలుపెట్టానా ఎన్నెన్నో మధురానుభూతులు ఒకవైపు, విచారవాహినులు మరొకప్రక్క నన్ను వుక్కిరిబిక్కిరిచేస్తూ వుంటాయి. అక్కడి రాజకుమార్ ఇక్కడ – ఈ భూమండలంలో – ప్రత్యక్షమయ్యాడు. ఆ సంఘటన ఎంత అమాంతంగా జరిగిపోయిందో, వాడు ఇక్కడినుంచి అదృశ్యమవటం అంత తొందరగానే జరిగిపోయింది. మీలో ఎవళ్లకయినా ఆఫ్రికా ఖండంలో సంచారం చేయటానికి అవకాశం కలిగిందా ఒక్కసారి అక్కడి ఆ పెద్ద ఎడారి ప్రాంతంలో ప్రయాణం చేయటానికి ప్రయత్నించండి... ఆ పని చూసుకోవాలి, ఈ పని చూసుకోవాలి అని సాకు చెప్పటం మానేసి ఆ ప్రాంతాలలో కొంతకాలం వుండిపోగలిగారా?...

అక్కడ పైకి తదేకదృష్టితో ఒక్కసారి చూడండి. అలా చేయడంలో మీకు కొంత వోపిక వుండటం అవసరంకూడా!... అలాటి సమయంలో మీ ముందరికి ఎవడైనా ఒక అబ్బాయి వచ్చాడా!...వాడి చిరునవ్వును చూశారా!...వెంట్రుకలు బంగారు రంగువి అయివుంటేనా...మీరేమైనా అడిగితే వాడు జవాబునీయకుండా వూరక వున్నాడా....ఆ అబ్బాయి ఎవడో మీకు చెప్పకుండానే తెలిసిపోతుంది...

అలాటి సమయంలో మిమ్మల్ని ప్రాధేయపడుతూ కోరేది ఒక్కటే! మా రాజకుమార్ తిరిగి ప్రత్యక్షమైనాడన్న సంగతి వెంటనే నాకు తెలపమని...

సమాప్తం




శ్రీ ప్రొడక్షన్స్‌వారి సాంఘికచిత్రం 'అభిమానం' సెప్టెంబరులో విడుదల గుటకు వీలుగా నిర్మాణం సాగుతున్నది. ఇందులో నాగేశ్వరరావు, రేలంగి, సావిత్రి, కన్నాంబ, దేవిక, కృష్ణకుమారి మున్నగు సుప్రసిద్ధ నటీనటులు పాల్గొంటున్నారు. దర్శకత్వము శ్రీ సి. యస్. రావుగారిది. రచన సముద్రాల (జూనియర్). సంగీతమును ఘంటసాలవారు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రనిర్మాతలు సిద్ధహస్తులైన శ్రీ సుందర్లాల్ నహతా, టి. అశ్వద్ధనారాయణ గారలు. రాజశ్రీ పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారు దీనిని విడుదలచేస్తారు.

♦ ♦ ♦

శ్రీ కే. బి. నాగభూషణంగారు రెండు పౌరాణిక చిత్రాల దర్శకత్వ నిర్వహణను పూనుకున్నారు. ఒకటి వరలక్ష్మీ పిక్చర్సువారిది, రెండవది శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీవారిది. ఇందులో ఒకచిత్రం 'బాణాసుర' కథయని తెలుస్తున్నది. రచన శ్రీ సదాశివబ్రహ్మంగారట.

♦ ♦ ♦

కృష్ణచిత్రవారి 'భావమరదళ్లు' చిత్రం పైనెల కావచ్చు యావదాంధ్రదేశంలో విడుదల. దీనికి దర్శక నిర్మాత శ్రీ పద్మనాభరావు. ఇందులోని బాలలు నటించిన నృత్యనాటికా సన్నివేశం ప్రత్యేక ఆకర్షణ అనుకొంటున్నారు. కృష్ణకుమారి, మాలిని, సూర్యకాంతం, శోభ, రాజరత్నం, రమణమూర్తి, సి. యస్. ఆర్., రేలంగి, బాలకృష్ణ, కుటుంబరావు, అల్లు రామలింగయ్య, చంద్రశేఖర్ మున్నగువారు నటించారు. రాజేశ్వరి నృత్య సన్నివేశాలు సమకూర్చబడినవి.

♦ ♦ ♦

మంజీరా ఫిలింస్‌వారి చిత్రనిర్మాణము ఆరాటము లేకుండా సాగిపోతున్నది. ఈ రసవంతమైన సాంఘికచిత్రంలో సావిత్రి, బాలయ్య, కాంతారావు, రమణారెడ్డి, శోభ, నూతన నటుడు డా॥ ప్రభాకర్ రెడ్డి మున్నగువారు నటిస్తున్నారు. శ్రీ అశ్వద్ధామ సంగీతం కూరుస్తున్నారు.

♦ ♦ ♦

ఇంచుమించు పూర్తికావస్తున్న చిత్రాలలో మహేంద్ర పిక్చర్స్‌వారి 'కృష్ణప్రేమ' ఒకటి. శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారి దర్శకత్వం, నిర్మాతల ఆసక్తి, కృషి ఫలితంగా చిత్రనిర్మాణం పూర్తికావస్తున్నది. ఇందులో సుప్రసిద్ధ తారాగణం జమున, యస్. వరలక్ష్మి, బాలయ్య, రేలంగి, గిరిజ, బాలకృష్ణ నటిస్తున్నారు. పెండ్యాలవారి సంగీతంతో సినిమా ప్రేక్షకులో కాన్ని ఆనందపరచబోతున్నదీ చిత్రం. దీన్ని శ్రీ ఫిలింస్ వారు విడుదల చేస్తున్నారు.

♦ ♦ ♦

'భక్తశబరి' చిత్రం విడుదలయింది. ఇది తెలుగు, తమిళ భాషలలో నిర్మించబడింది. నిర్మాత శ్రీ బి. ఆర్. నాయుడు ఊహాపోహలతోటి, శ్రీ చిత్రపు నారాయణమూర్తి దర్శకత్వంతోటి ఆదర్శనీయమైన భక్తిరసభరిత చిత్రంగా రూపొందిందని వార్తలు. పండరీబాయి శబరిగాను, యింకా నాగయ్య, యల్. విజయలక్ష్మి, హరినాథ్, శోభన్‌బాబు, రామకృష్ణ, రాజశ్రీ, మీనాకుమారి మున్నగువారు నటించారు. తెలుగు చిత్రంలో విలన్‌గా కే॥ శే॥ ఆర్. నాగేశ్వరరావు, తమిళ చిత్రంలో అశోకన్ నటించారు.

♦ ♦ ♦

ఫిలిం ఫాన్స్ అసోసియేషన్‌వారు ఏర్పాటుచేసిన ఉత్సవంలో ఉత్తమ చిత్రాలకు, నటీనటులకు మద్రాస్ గవర్నర్ బహుమతులు పంచిపెట్టారు. ఈ సందర్భమున ఉత్తమ చిత్రంగా 'మాయింటి మహాలక్ష్మి', ఉత్తమ డైరక్టరుగా శ్రీ రామినీడు ఎన్నుకోబడ్డారని పాఠకులకు తెలిసిన విషయమే. ప్రథమ ప్రయత్నంలోనే రాణింపుకు వచ్చిన యువడైరెక్టర్ శ్రీ రామినీడుకు మహోజ్వలమైన భవిష్యత్తు గలదని

ఆశింపబడుతూంది. ఈయన యిప్పుడు మంజీర ఫిలిమ్స్, నవశక్తి ఫిలింస్ వారు నిర్మిస్తున్న చిత్రాలకు దర్శకత్వము నిర్వహిస్తున్నారు. నవశక్తి ఫిలింస్ తరఫున శ్రీ జయదేవ్, శ్రీ ఏ. నాగేశ్వరరావు బహూకరించిన రోలింగ్ కప్పును ఉత్తమ దర్శకుడుగా శ్రీ రామినీడు, ఇల్లరికంలో ఉత్తమనటుడుగా శ్రీ ఏ. నాగేశ్వరరావు బహుమతులను పొందారు. ఇంకా 'ఇల్లరికం' కథారచయితగా శ్రీ సదాశివబ్రహ్మం, 'మాయింటి మహాలక్ష్మి' లో ఉత్తమ నటిగా జమున, 'జయభేరి'లో ఉత్తమ సహాయ నటుడుగా గుమ్మడి, సహాయనటిగా శాంతకుమారి, 'మాంగల్యబలం' లో ఉత్తమ హాస్యనటుడుగా రేలంగి బహుమతులను పొందారు. ఈ బహుమతుల స్వీకరణ సందర్భమున జమున, శాంతకుమారి, ఏ. నాగేశ్వరరావు, రేలంగి అసోసియేషన్కు, ఉత్తమ నిర్ణయాలకు కారకులైన న్యాయమూర్తులకు ధన్యవాదాలర్పించి, యిట్టి గుర్తింపు నటీనటులు, డైరెక్టర్లు, నిర్మాతలు ఉచితమార్గంలో నడువడానికి తోడ్పడగలవన్నారు.

◆ ◆ ◆

శ్రీ తాపీచాణక్య దర్శకత్వాన సారధీవారు నిర్మిస్తున్న 'ఒకేమార్గం' చిత్రం నవీనతతోటి విశిష్టతతోటి తయారగుచున్నది. బాలయ్య, సావిత్రి జగ్గయ్య మున్నగు ప్రముఖ తారాగణం పాల్గొంటున్నారు.

## చిత్ర సమీక్ష

పద్మినీ పిక్చర్స్ వారి

### 'పిల్లలు తెచ్చిన చల్లనిరాజ్యం'

చిత్రంపేరు చూచి బాలలకని మాత్రమే నిర్మించి శ్రీ బి. ఆర్. పంతులుగారు విడుదల చేశారేమో నని పించినా యిది పిన్నలు, పెద్దలకు న్యాయమును, ధర్మమును ప్రబోధిస్తూ, దురాగతాలను, దుర్మార్గాన్ని అరికట్ట హెచ్చరించే చిత్రము. ఇందులో నటించిన బాలలు ముచ్చటగాను, ఒక్కొక్కచోట ఉత్సాహోద్రేకాలను రేకెత్తిస్తూ నటించారు. యం. వి. రాజమ్మ రాణిగా సహజంగా నటించి త్యాగాన్ని, చిత్తశుద్ధిని, ఓర్పును ప్రబోధించింది వివిధ సన్నివేశాలలో. రాజనాల విలన్ గా బాగానే నటించాడు.

ఇందులో గేవాకలరు చంద్రమండల దృశ్యాలు ప్రత్యేక ఆకర్షణ. సంగీతము, నృత్యసన్నివేశాలు విన, కన యింపుగా నున్నవి. ఉత్తమస్థాయి చిత్రాలలో నిదియొకటి. ధర్మము, న్యాయములే చివరకు జయం పొందుతవని చాటే యీ చిత్రం విజ్ఞానం, వినోదం, ఉల్లాసం కలిగించి ప్రేక్షకుల హృదయాలను హరించగలదని ఆశిస్తున్నాము.

◆ ◆ ◆

భార్గవి ఫిలింస్ వారి

### 'దేవాంతకుడు'

'దేవాంతకుడు' చిత్రం యిప్పుడు విడుదలైన ఉత్తమశ్రేణి చిత్రాలలో నొకటి. శ్రీ సి. పుల్లయ్యగారి దర్శకత్వపు విశిష్టతకు యీ చిత్రం ప్రతిబింబము. నాయికీనాయకులుగా కృష్ణకుమారి, యన్. టి. రామారావు అత్యద్భుతంగా నటించారు.

ప్రేక్షకుల నాకర్షించి, ఆనందపరచే అన్ని హంగులుగల చిత్రమిది: సంగీతము, సాహిత్యము, హాస్యము ఉత్తమస్థాయికి చెందినవి. బ్రహ్మాండమైన సెట్టింగులు చిత్రానికి శోభను చేకూర్చినవి. ప్రస్తుత కాలపరిస్థితులను, సందర్భాలను తెలిపుచ్చే సమయోచిత సంభాషణలు ప్రజలకు వినోద ఉల్లాసాలను సమకూర్చునవిగా నొప్పినవి.

ప్రేమికుల హృదయాలు పవిత్రమైనవై, పరస్పర అనురాగ సహకారాలు గాఢమైనవైతే యువతీయువకులు ఎట్టి అక్రమాలనైనా, దుర్మార్గాన్నైనా ఎదిరించి తమ లక్ష్యసిద్ధిని సాధించగలరని కృష్ణకుమారి, యన్. టి. రామారావు తమ భూమికల ద్వారా ఆడుతూ, పాడుతూ నిరూపించారు.

అక్కడక్కడ తెలుగు నాటకరంగాన్ని స్ఫురణకు తెచ్చు పద్యాలు, పాటలు, విష్ణుమూర్తి, నారదుడు, పార్వతీపరమేశ్వరులు, శ్రీమహాలక్ష్మి, యముడు లాంటి భూమికలు జనసామాన్యాన్ని విశేషంగా నాకర్షించగలవు. ఫలించిన కృషి నిర్మాత దర్శకులు శ్రీ సి. పుల్లయ్యగారికి అత్యధిక కీర్తిప్రతిష్టల నార్జించుటతోబాటు, చిత్రము విజయయాత్ర సాగించగలదని గట్టిగా చెప్పగలము.

—పున్నయ్య

# సంపాదకీయములు

## విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషుకు ఉద్వాసన

ఇంగ్లీషుకు ఉద్వాసన చెప్పడానికి గుజరాత్ విశ్వవిద్యాలయ సెనేటు నిశ్చయించింది. మరికొన్ని ప్రాంతీయ విశ్వవిద్యాలయములు విద్యాబోధనను ఇంగ్లీషునుండి ప్రాంతీయభాషలలోనికి మార్చ నుపక్రమించినవి. వసుధైక రాజ్యస్థాపన, శాంతియుత సహజీవన సిద్ధాంతాలలాంటి వానినిగురించి గంభీరంగా మాట్లాడుతూ ప్రాంతీయభాషా దురభిమానాలకు లోనుకావడం శోచనీయం. ఎవరు ఏమని వాదించినా ప్రపంచం మొత్తాన్ని ఇంగ్లీషు ఐక్యపరచింది. ప్రపంచమందలి వివిధదేశముల మధ్య సమరస సద్భావాలను, సహకార సహాయాలను పెంపొందచేస్తున్నది. ఇంగ్లీషు భాషాప్రభావం మొత్తంమీద సాంఘిక, సారస్వత, సాంస్కృతిక రంగాలలో ప్రతిదేశాన్ని అభివృద్ధి అభ్యుదయాలవైపుకు పురోగమింపచేస్తున్నది. విదేశీయపరిపాలనలో ఇంగ్లీషుభాష ప్రాబల్యంవలన ప్రాంతీయభాషల అభివృద్ధి కుంటుబడియుండవచ్చును. తదనుగుణంగా జాతీయ రంగంలో సత్ఫలితాలతోబాటు కొన్ని దుష్ఫలితాలుండియుండవచ్చును. అయితే యీనాడు మనం, మన దేశం స్వతంత్రులము. ప్రాంతీయభాషల అభివృద్ధి మనచేతుల్లో నున్నది. వాటిని ఉత్తమస్థాయిలో పెంపొందించుకొని తీరాలి. కాని జాతీయ, అంతర్జాతీయ రంగాలలో యింతకాలము ప్రపంచమంతటితో బాటు మనకు అనేక రంగాలలో వినియోగపడిన, పడనున్న, పడుతున్న ఇంగ్లీషుభాషను ద్వేషించి తొందరపడటం అవివేకత కాగలదు. ఇదేసందర్భమున దేశవ్యాప్తంగా విస్తరిస్తున్న హిందీపట్ల వ్యతిరేకతకూడ గుర్తించవలసిన విషయం. సాధారణ ధోరణిలో హిందీ నభ్యసించుటను గతంలోను, యిప్పుడు వ్యతిరేకించినవారు బహుకొద్దిమంది. కాని బలవంతంగా ఇంగ్లీషుస్థానంలో హిందీ జాతీయభాషగా ప్రవేశపెట్టాలనే నిర్ణయం వ్యతిరేకతకు కారణమయింది. ఇంగ్లీపట్లలేని వ్యతిరేకత హిందీపట్ల కొన్ని ప్రాంతములలో నున్నదంటే ఇంగ్లీషుకు మనదేశంలోను, ప్రపంచములోను ఏర్పడిన ప్రాముఖ్యత, ఆవశ్యకతని గుర్తించాలి. ప్రపంచభాషగా రాణింపుకు వచ్చిన ఇంగ్లీషు యీనాడు ఒక్క ఇంగ్లండుకు మాత్రమే పరిమితమయినదని చెప్పలేము. ప్రపంచంలోని దేశదేశాలు ఇంగ్లీషును తమ స్వీయ శ్రేయోసౌభాగ్యములకు, అభ్యుదయ అభివృద్ధులకు వినియోగించుకొంటుంటే మనం మాత్రం దాన్ని తృణీకరించి మనదేశ ప్రాంతాలలోనే అభిమానపాత్రము కావాలని హిందీని ఇంగ్లీషుస్థానంలోకి తేవాలని మంకుపట్టు పట్టడం అశాంతికి కారణమగుటలో విశేషంలేదు.

జాతీయాభిమానం అత్యవసరమే. అది కాలమాన పరిస్థితులనుబట్టి వాస్తవికత కనుగుణ్యమైనదయితే హర్షించతగినదే. జాతీయాభిమానం స్వీయభాషను, సంస్కృతిని, సారస్వతాన్ని పెంపుచేసుకోడానికి వినియోగపడాలి కాని విశిష్టతను, అవసరాన్ని గుర్తించకుండా విజాతీయమైనదని ఇంగ్లీషును తృణీకరిస్తే విషమఫలితాలు అనేకం ఏర్పడినా ఆశ్చర్యపడనవసరముండదు.

వేషభాషల్లో, సాంప్రదాయ ఆచారములలో యింకా అనేక విషయాలలో నేటి ప్రపంచములోని దేశాలు పరస్పరము అనుకరిస్తున్నవి. అదే మనం చేస్తున్నాము. అటువంటప్పుడు ఎంతోకాలంనుండి దేశమును సమైక్యపరచి విజ్ఞానవికాసముల పెంపుకు తోడ్పడిన, తోడ్పడుతున్న తోడ్పడగల ఇంగ్లీషును ద్వేషించి తృణీకరించడము, అందుకీనాడు వెనువెంటనే తోడ్పడగల స్థితిలోలేని హిందీని బలవంతపు బ్రాహ్మణార్థంగా 'జాతీయభాష' పేరుతో ప్రవేశపెట్ట పూనుకోడం అనాలోచితము తప్ప మరేమి కాదు. మనం ఇంగ్లీషును జాతీయభాషగా పేర్కొనలేకపోవచ్చును. అంతకంటె ఎక్కువగా వినియోగపడగల ఇంగ్లీషును మనం ఏమని పిలచినా, జాతీయభాషలుగా ప్రాంతీయభాషలే చలామణిఅయి, ఇంగ్లీషు శాశ్వతంగా సహాయభాషగా వర్థిల్లాలి!

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah. Proprietors Kesari Kuteeram (Private) Ltd.

**60**
సంవత్సరాలుగా
స్త్రీ జనులతో
సన్నిహిత
బాంధవ్యము
కలది




# లోధ్ర

స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు

కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14.

SISTA'S

